





# శతకాలు

భక్తి,జ్ఞాన,నీతి

# సుభాషిత శతక త్రయము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




# భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని జళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.

శ్రీనీలకంఠమహాకవికృత

# సుభాషితశతకత్రయము

(కలివిడంబన, సభారంజన, వైరాగ్యశతకములు)

## సాంధ్రతాత్పర్యము



(స్వధర్మప్రకాశినీపత్రికనుండి పునర్ముద్రితము.)

గ్రంథసంపాదకుడు:

కనుపర్తి. మార్కండేయశర్మ.

శ్రీ ర స్తు.

శ్రీనీలకంఠమహాకవికృత

# సుభాషిత శతకత్రయము.

ఆంధ్రతాత్పర్యసహితము.

## ౧. కలివిడంబన శతకము.



### పండితులు.

శ్లో. న భేతవ్యం న బోద్ధవ్యం న శ్రావ్యం వాదినో వచః,
ఝడితి ప్రతివక్తవ్యం సభాసు విజిగీషుభిః. ౧

తా. పాండిత్యములేకయే పండిత సభలయందు పండితులతో వాదింపవచ్చినవారలు జయము నపేక్షించెడివారలు. "తనకావిషయము తెలియునో తెలియదోయని భయంపడరాదు. పూర్వపక్ష మొనర్చిన వాని యభిప్రాయ మేమి? యనియైనను తెలిసికొన ప్రయత్నింపకూడదు. చివరకు పూర్వపక్షిపలికినమాటనుకూడ సాంతముగ వినఁగూడదు. ఎదిరినోటినుండి మాటవెలుపలికి వచ్చిరాకముందే వెంటనే నోటదొర్లినమాటను బదులు పలుకవలయును" ఇటులయినయెడల నీకాలమునందు జయశాలి యను ప్రసిద్ధిని సులభముగ పొందును.

శ్లో. అసంభ్రమో విలజ్జత్వ మవజ్ఞా ప్రతివాదిని,
హాసో రాజ్ఞ స్తవశ్చేతి పంచైతే జయహేతవః. ౨

తా. ఈకలికాలమునందు సభలయందు జయము నపేక్షించువారలు దేనికయినను భయపడకయుండుట, సిగ్గును విడుచుట, ప్రతివాదియగు పండితుని అవమానించుట, వానిని పరిహసించుట, సభాధ్యక్షునిపొగడుట యను నైదు గుణములను చక్కఁగ ప్రయోగించుచుండవలయును.

శ్లో. ఉచ్చై ర్ఘుష్య జేతవ్యం మధ్యస్థ శ్చేదపండితః,
పండితో యది తత్రైవ పక్షపాతోఽధిరోప్యతామ్. 3

తా. మాధ్యస్థ్యమువహించినవాఁడు పండితుఁడు కాని యెడల పెద్దగొంతుతో మాటాడినయెడల అతనికి జయము సిద్ధము మాధ్యస్థ్యము వహించినవాఁడు పండితుఁడయినయెడల ఇతఁడు పక్షపాతము వహించియున్నాఁడని ఆక్షేపించవలయును.

శ్లో. లోభో హేతుర్ధనం సాధ్యం దృష్టాంతస్తు పురోహితః,
ఆత్మోత్కర్షో నిగమన మనుమానేష్వయం విధిః. ౪

తా. హేతువు, సాధ్యము, దృష్టాంతము, నిగమనము, అని అనుమానమునకు నాలుగంగములు గలవు. ఆనాలుగంగములు ఇప్పటి పండితులయం దిట్లు నన్వయించుచున్నవి — హేతువు (ధనము సంపాదించుకొనుటకు నిమిత్తము) ఆశ సాధ్యము (అనఁగా సాధింపఁదగినది) ధనము దృష్టాంతము (అనఁగా ఎన్నియకార్యము లొనర్చియైనను ధనము సంపాదించి తీరవలయుననుటకు) పురోహితుఁడు, నిగమనము, స్వాతిశయము, అని తలంచవలయును

శ్లో. అభ్యాస్యలజ్జమానేన తత్త్వం జిజ్ఞాసునా చిరం,
జగీషుణా హ్రియం త్యక్త్వా కార్యః కోలాహలో మహాన్. ౫

తా. చిరకాలము గురుకులవాసము చేసి విద్య నేర్చుకొనవలసిన సమయమందు తానొండొరుల దగ్గఱకు పోయి చదువుకొనుటకు సిగ్గుపడునట్టివాఁడు సభయందు పండితుల జయింపవలయునని తలంచునెడల సిగ్గునువిడిచి సభయందు ఎదరివానికి ఏమియు తెలియకుండులాగున పెద్దకోలాహలమొనర్చి వారు గుడల పండితుల నవలీలగ జయించవచ్చును.

శ్లో. పారక్యైర్గ్రంథనిర్మాణైః ప్రతిష్ఠా తావదాప్యతే,
ఏవం సతస్తు వ్యుత్పత్తి రాయుషోఽంతే భవేన్నవా. ౬

తా. చదివినది కొంచెమైనను దానిని శిష్యులకు బోధించుటచేతను, ఏవో కొన్ని గ్రంథములను తలలమార్చి వ్రాయుటచేతను గొప్పపండితుఁడను కీర్తిని బడయవచ్చును గాని ఇట్టివానికి మంచిపాండిత్యము మాత్రము వాని ఆయుర్దాయములోపల రాఁజాలదు.

శ్లో. స్తోతారః కే భవిష్యంతి మూర్ఖస్య జగతీతలే,
న స్తౌతి చేత్స్వయంచ స్వం కదా తస్యాస్తు నిర్వృతిః. ౭

తా. లోకమునందు మూర్ఖుఁడగువానిని పొగడువార లెవ్వరుండరు కావున తన్ను తానే పొగడుకొనవలయును. తానిట్టివాఁడనని సంతోషించుటకు తన్నుతానే పొగడికొననియెడల వానికి సంతోష మెట్లుకలుగును?

శ్లో. వాచ్యతాం సమయోఽతీతః స్పష్టమగ్రే భవిష్యతి,
ఇతి పాఠయతాం పుంసాం కాఠిన్యం కుత్ర వర్తతే. ౮

తా. శిష్యుఁడు శాస్త్రాభ్యాస సమయమునందు గురువుగారు చెప్పినయంశము తనకు తెలియనియెడల స్వామీ! తాము చెప్పినవిషయము నాకు బాగుగా తెలియలేదు. దయచేసి వివరించి చెప్పవలయును అని గురువును అడుగఁగా ఆగురువగ్యుఁడు "చదువుచుఁ బొమ్ము, ప్రొద్దుపోయినది. ముందుముందు చక్కఁగా నీవిషయమే రాఁగలదు"

## జ్యౌతిషికులు.

శ్లో. చారాన్ విచార్య దైవజ్ఞై ర్వక్తవ్యం భూభృతాం ఫలమ్,
గ్రహాచారపరిజ్ఞానం తేషా మావశ్యకం యతః. ౧౪

తా. జ్యౌతిషికులగువారలు ఫలాఫలములను చెప్పునప్పుడు అవశ్యముగా గ్రహచారవిషయము నెఱింగి చెప్పవలయుననుట శాస్త్రసంప్రదాయము కావున రాజులయొక్క చారులనువిచారించి ఫలాఫలములను చెప్పవలయును. గ్రహచార పరిజ్ఞానమనఁగా జ్యౌతిశాస్త్రమునందు గోచారపరిజ్ఞానము అని యొక యర్థము. గ్రహములయొక్కయు చారులయొక్కయు పరిజ్ఞానము అని ఇచట శ్లేషించి యర్థము చెప్పఁబడినది

శ్లో. పుత్ర ఇత్యేన పితరి కన్యకేత్యేవ మాతరి,
గర్భప్రశ్నేషు కథయన్ దైవజ్ఞో విజయీ భవేత్. ౧౫

తా. ఏబిడ్డపుట్టును? అని గర్భప్రశ్ననుగూర్చి జ్యౌతిషికుని ఎవ్వరేని యడిగిన యెడల తండ్రితో కుమారుఁడు పుట్టుననియు, తల్లితో కూఁతురు పుట్టుననియు, చెప్పునెడల వాఁడు జయించితీరును. అనఁగా కొడుకుపుట్టునని చెప్పితివే కూఁతురు పుట్టినదేయేమి? యని తండ్రి యడిగినయెడల నాకీవిషయము ముందే తెలియును. నీమనస్సంతోషార్థము అట్లు చెప్పినాను. మీభాగ్యతో నీవిషయమును అప్పుడేచెప్పినాను అడిగి తెలిసికొనుఁడని చెప్పి తనమాట సమర్థించుకొనును.

శ్లో. ఆయుఃప్రశ్నే దీర్ఘమాయు ర్వాచ్యం మౌహూర్తికై ర్జనైః,
జీవన్తో బహుమన్యంతే మృతాః ప్రక్ష్యంతి కం పునః. ౧౬

తా. జ్యౌతిషికుఁడు ఎవ్వఁడేని నేనెంతకాలము జీవించెదను అని ఆయుఃప్రశ్నము చేయునెడల దీర్ఘాయుర్దాయముసుమీ యని పలుకవలయును. చిరకాలము జీవించియున్నయెడల జ్యౌతిషికునకు సత్కారము కలుగును. లేక వాఁడు చనిపోవునెడల జ్యౌతిషికుని చూచి ఏమయ్యా దీర్ఘాయుర్దాయమంటివే చచ్చిపోయినా నేమి? యని యడుగఁజాలఁడు గదా.

శ్లో. సర్వం కోటిద్వయోపేతం సర్వం కాలద్వయావధి,
సర్వం వ్యామిశ్ర మిన చ వక్తవ్యం దైవచింతకైః. ౧౭

తా జ్యౌతిషికుఁడు ఫలములు చెప్పునప్పుడు రెండుపక్షములుగాను, రెండేసికాలములు గలదిగను చెప్పి తప్పించుకొనుచుండవలయును. అనఁగా బృహస్పతి ఏకాదశస్థానమునందు ఉచ్చంగతుఁడయి యున్నందువలన కార్యము సానుకూలమగును గాని శని అష్టమస్థానమునందుండుటవలన కొంత సంశయము గలదనియు, పైనెలలోఁగాని లేక

3 మాసముల పిదపఁగాని కార్యము సానుకూలమగుననియు ఇట్లు రెండురెండుగా చెప్పుట మంచిది.

శ్లో. నిర్ధనానాం ధనావాప్తిం ధనినా మధికం ధనమ్,
బ్రువాణా స్సర్వదా గ్రాహ్యా లోకే జ్యోతిషికా జనాః. ౧౮

తా. లోకమునందు దరిద్రులువచ్చి జాతకము చూపించినయెడల నీజాతకునకు ధనయోగము గలదనియు, ధనవంతుఁడు జాతకము చూపించునెడల ప్రబలరాజయోగము గలదనియు చెప్పెడి జ్యోతిషికునే అందఱును ఆదరించుచున్నారు.

శ్లో. శతస్య లాభే తాంబూలం సహస్రస్య తు భోజనమ్,
దైవజ్ఞానా ముపాలంభో నిత్యః కార్యవిపర్యయే. ౧౯

తా. జ్యోతిషికుఁడు లాభమువచ్చునని చెప్పినతర్వాత ౧౦౦ రూపాయీలు లాభించునెడల అతనికి ఒక తాంబూలము దొరకును ౧౦౦౦ రూపాయీలు లాభించినయెడల జ్యోతిషికునిపిలిచి భోజనము పెట్టెదరు లాభమురాక నష్టమువచ్చినయెడల తిట్లుమాత్రము తప్పక లభించును. లాభము వచ్చినప్పుడు, తాంబూలము, భోజనము ఒకవేళ లభించుట లభింపకపోవుట కలుగుగాని చెడినయెడల తిట్టుమాత్రము తప్పక కలిగి తీరును.

శ్లో. అపి సాగరపర్యంతా విచేతవ్యా వసుంధరా,
దేశో హ్యరత్నిమాత్రోఽపి నాస్తి దైవజ్ఞవర్జితః. ౨౦

తా. సముద్రపర్యంతముగల భూమినంతయు వెదకిచూచినను ఒక్కమూరప్రదేశమున నొక్కఁడుచొప్పున జ్యోతిషికులు నిండియున్నారు.

శ్లో. వారాన్ కేచి ద్గ్రహాన్ కేచిత్ కేచి దృక్షాణి జానతే,
త్రితయం యే విజానంతి తే వాచస్పతయ స్స్వయమ్. ౨౧

తా. ఇప్పటి జ్యోతిషికులలో కొందఱు ఆది, సోమ, మున్నగు ౭ వారములపేర్లు మాత్రము ఎఱింగియున్నారు అంతకంటె ఎక్కువ పాండిత్యము గలవారలమని తలంచువారలు సూర్య, చంద్రాదినవగ్రహనామము లెఱింగియున్నారు. అంతకంటె శ్రేష్ఠులమనుకొనువారలు, అశ్విన్యాది ౨౭ నక్షత్రములనామము లెఱింగియున్నారు. వార, గ్రహ, నక్షత్రములు మూడింటియొక్క నామములు తెలిసినవారు తామే బృహస్పతు లగుచున్నారు. అనఁగా కలికాలమునందు పలువురువిద్యావిహీనులుకూడ జ్యోతిషికులమని లోకులమోసపుచ్చుచున్నారనుట.

శ్లో. నైమిత్తికా స్స్వప్నదృశో దేవతోపాసకా ఇతి,
నిసర్గశత్రవ స్సృష్టా దైవజ్ఞానా మమీ త్రయః ౨౨

తా. నైమిత్తికులు (అనఁగా శకునఫలము నెఱింగి చెప్పువారలు) స్వప్నఫలములు చెప్పెడివారలు, దేవతానుగ్రహముచేత శుభాశుభములు కలుగఁజేయఁగలమని చెప్పెడి దేవతోపాసకులు అను మైమువ్వురును జ్యోతిషికులకు సహజశత్రువులు.

వైద్యులు.

శ్లో. స్వస్థై రసాధ్యరోగై శ్చ జంతుభి ర్నాస్తి కించన,
కాతరా దీర్ఘరోగా శ్చ భిషజాం భాగ్యహేతవః. ౧౩

తా. వైద్యులకు ఆరోగ్యవంతులవల్లనుండియు, అసాధ్య రోగముగలవారలనుండియు లాభ మేమియులేదు. జలుబుచేయఁగానే భయంపడువారలవల్లనుండియు, దీర్ఘరోగము గలవారలనుండియు వైద్యులకు లాభముకలిగి తీరవలయును.

శ్లో. నాతిధైర్యం ప్రదాతవ్యం నాతిభీతిశ్చ రోగిణే,
నైశ్చింత్యా న్నాదిమే దానం నైరాశ్యా దేవ నాంతిమే. ౧౪

తా. రోగి తనసమీపమునకు వచ్చినప్పుడు ఈజబ్బునిమిషములో పోవును భయపడకుము అని ధైర్యము చెప్పకూడదు. ఈరోగము కుదురనేకుదురదు అని మిక్కిలి భయపెట్టకూడదు నిమిషములో కుదురునని ధైర్యముచెప్పినయెడల కుదురును గదా ఏల ధనము ఖర్చుపెట్టుటయనియు, కుదురదని అధైర్యము చెప్పినయెడల కుదురనేకుదురదే ఏల ద్రవ్యనష్టమనియు తలంచి వైద్యునకు ధనము నొసంగరు.

శ్లో. భైషజ్యంతు యథాకామం పథ్యం తు కఠినం వదేత్,
ఆరోగ్యం వైద్యమాహాత్మ్యా దన్యథాత్వ మపథ్యతః. ౧౫

తా. వైద్యుఁడు రోగికి ఏదోఒకమందు తనకిష్టమువచ్చినది మాత్రమియ్యవచ్చును గాని పథ్యమును మాత్రము అతికఠినమైనదానినిగా చెప్పవలయును రోగము నయమైనయెడల వైద్యుఁడు గట్టివాఁడను కీర్తికలిగితీరునుగదా రోగము కుదురనియెడల మీరుపథ్యమును సరిగాచేయలేదు. దానికి నేనేమిచేయఁగలనని చెప్పి తప్పించుకొనవచ్చును.

శ్లో. నిదానం రోగనామాని సామాన్యాసామ్యం చికిత్సితమ్,
సర్వ మప్యుపదేక్ష్యంతి రోగిణ స్సదనే స్త్రియః ౧౬

తా. రోగియొక్క ఇంటియందున్న స్త్రీలు "రోగమువచ్చుటకు కారణము, రోగముయొక్క పేరు, ఏమి అనుకూలము, యేమివ్యతిరేకము, ఇదివఱకు ఏమిచికిత్సచేసినది" మున్నగువిషయములను వైద్యునకు చెప్పఁగలరు కావున నీవిషయమయి వైద్యుఁడు విశేషించి పరిశ్రమ చేయనక్కఱలేదు.

శ్లో. జృంభమాణేషు రోగేషు మ్రియమాణేషు జంతుషు,
రోగతత్త్వేషు శనకై ర్వృత్త్వాపాద్యం తే చికిత్సకాః. ౧౭

తా. ఈకలికాలమునందు కొందఱు వైద్యులు "తాముచేయు వైద్యమువలన కొందఱు రోగులకు రోగము వృద్ధియగుటను, కొందఱు వ్యాధిగ్రస్తులు మరణించుటను గాంచుచు, ఈమందును తప్పుగా వాడుటచేత వీనికి రోగము వృద్ధియయినదనియు, ఈమందును తప్పుగా వాడుటచేత మరణించెననియు తెలిసికొనుచు వ్యాధిలక్షణ పరిజ్ఞానమునందు నేర్పరులగుచున్నారు.

శ్లో. ప్రవర్తనార్థ మారంభే మధ్యే త్వౌషధహేతవే,
బహుమానార్థ మంతేచ జిహీర్షంతే చికిత్సకాః. ౨౮

తా. వైద్యులు మొట్టమొదట వైద్యముచేయుటకనియు, మధ్యమధ్యను కర్చులకనియు, చివరకు బహుమానార్థమనియు రోగులనుండి డబ్బును లాగుచుందురు.

శ్లో. లిప్సమానేషు వైద్యేషు చిరా దాసాద్య రోగిణః,
దాయాదా స్సంప్రరోహంతి దైవజ్ఞా మాంత్రికా అపి. ౨౯

తా. ఎంతోకాలమునుండి "ఎవనికయినరోగము రాఁగూడదా వాఁడు నాదగ్గఱకు ఔషధసేవనార్థము రాకూడదా" యని తపముచేయుచుండ వాని యదృష్టవశమువలన ఒకరోగి తటస్థించును, వానివలన తన దారిద్ర్యమును పోఁగొట్టుకొనవచ్చునని సంతోషించుచున్న సమయమునందు అతని సంతోషమునకు విఘాతుకముగా జ్యోతిషికులు, మాంత్రికులు, అనెడి దాయాదులు వానికేర్పడి వానికిరాఁబోవు లాభమునకు అడ్డుతగులుచున్నారు. అనఁగా ఇదిరోగముకాదు. ఇప్పుడు శనిచాలఁడు. ఇంక నాలుగుమాసములవఱకిట్లేయుండును. తరువాత శని మంచివాఁడగును. అప్పుడు బాగుపడియెదవని జ్యోతిషికుఁడును, ఇది రోగముకాదు. మందు పుచ్చుకొనిన ప్రయోజనములేదు. గ్రహబాధవలన ఇట్టిస్థితి యేర్పడినది. రక్షరేకుకట్టిన నయమగును. అని మాంత్రికుఁడునుచెప్పి వైద్యునినోట రాళ్లువేయుదురు.

శ్లో. రోగస్యోపక్రమే సాంత్వం మధ్యే కించి ద్ధనవ్యయః,
శనై రనాదర శ్శాంతౌ స్నాతో వైద్యం న పశ్యతి. ౩౦

తా. రోగులు రోగమువచ్చిన క్రొత్తలో నీవే మాయింటి వైద్యుఁడవు నీదియమృతహస్తము అని వైద్యునిపొగడి అతనికడ మందుపుచ్చుకొందురు. మందుతినుటకు ప్రారంభించినతర్వాత కొంచెము ధన మొసంగెదరు. రోగము తగ్గుదలకు వచ్చునప్పుడు మెల్లగా వైద్యునియందు ఆదరము తగ్గుచుండును. ఆరోగ్యస్నానము చేసినతర్వాత వైద్యుఁడు ఇంటికివచ్చినను వానిని చూడనేచూడఁడు.

శ్లో. దైవజ్ఞత్వం మాంత్రికతా భైషజ్యం చాటుకౌశలమ్,
ఏకైక మర్థలాభాయ ద్విత్రియోగ స్తు దుర్లభః. ౩౧

తా. జోస్యము, మాంత్రికత్వము, వైద్యము, చమత్కారముగా ఎదుటివారి మనస్సునకు నచ్చునటుల మాటాడుచేప్పు, అను నట్టిగుణములు నాల్గింటిలో ఒక్కొకగుణమున్నను అధికద్రవ్యమును గడింపవచ్చును. రెండుమూఁడుగుణము లొకచోటనుండుట అరుగుకాని అట్లుండినయెడల వానివిషయమై చెప్పవలసిన దేమియున్నది. అనఁగా అతఁడు తప్పక ధనము నధికముగ గడింపఁగలఁడు.

శ్లో. అనృతం చాటువాద శ్చ ధనయోగో మహానయమ్,
సత్యం వైదుష్య మిత్యేష యోగో దారిద్ర్యకారకః. ౩౨

తా. అసత్యమాడుట, ఎదుటివారిమనస్సు నచ్చునటుల మాటాడుట యను వానివలన గొప్పధనయోగము కలుగును. సత్యము పలుకుట, పాండిత్యము అను గుణద్వయమువలన దారిద్ర్యయోగము ప్రాప్తించును. అని కలిమహాపురుషుని శాసనము.

కవీశ్వరులు.

శ్లో. కాతర్యం దుర్వినీతత్వం కార్పణ్య మవివేకితామ్,
సర్వం మార్జంతి కవయ శ్శా (లి) కినీముష్టికింకరాః. ౩౩

తా. పిడికెఁడు వడ్లగింజలు జోలిలోపడవేయువానికి భృత్యానుభృత్యులయి చరించునట్టి కవీశ్వరులు తమకు బిచ్చము పెట్టువారు 'భయము, వినయరాహిత్యము, లోభిత్వము, అవివేకము' మున్నగు దుర్గుణము గలవారలయినను వారిని పౌరుషశాలులనియు,అణఁకువగలవారనియు,దానశీలురనియు,పొగడిపొగడి లోకులముందఱ వెల్లడిచేయుచుందురు.

శ్లో. న కారణ మపేక్షంతే కవయ స్తోతు ముద్యతాః,
కించిదస్తువతాం తేషాం జిహ్వా ఘురఘురాయతే. ౩౪

తా. కవీశ్వరులయినవారలు ఎవనినైనను పొగడుటకు ప్రారంభించినయెడల ఆ స్తోత్రమున కతఁడు అర్హుఁడా అనర్హుఁడా యను దానిని విచారింపకయే నోటికివచ్చినటులు పొగడుచుందురు. కొంచెముసేపు దేనినైనను పొగడనియెడల వారినాలుక పురపురలాడుచుండును కావున నాలుక తీఁటతీర్చుకొనుటకయి వారువాగుచుందురు.

శ్లో. స్తుతం స్తువంతి కవయో న స్వతో గుణదర్శినః,
కీటః కశ్చి దళి ర్నామ కియతీ తత్ర వర్ణనా. ౩౫

తా. కవీశ్వరులు ఇదివఱ కొకరుపొగడినారే మనము పొగడనియెడల బాగుండదు అని తలంచి పొగడుచుందురుగాని తామావస్తువుయొక్క గుణావగుణములనెఱింగి వర్ణించుటలేదు. ఇందుల కొక నిదర్శనమును చూడుఁడు. తుమ్మెదయనునది ఒకసామాన్యమయిన పురుగు ఆతుమ్మెదనుగూర్చి ఎందఱు ఎన్నివిధముల పొగడియున్నారో చూడుఁడు.

శ్లో. ఏకైవ కవితా పుంసాం గ్రామాయాశ్వాయ హస్తినే,
అంతతోఽన్నాయ వస్త్రాయ తాంబూలాయ చ కల్పతే. ౩౬

తా. కవిత్వమనునది ఒక్కటియే అదృష్టమున్నయెడల అగ్రహారమును సంపాదించిపెట్టును ఏనుగును బహుమానమిప్పించును. గుఱ్ఱమును సంపాదించును. వానివాని సందర్భములనుపట్టి ఆకవిత్వమే ఒక్కనికి ఒకపూటతిండినో, గుడ్డనో, తాంబూలమునో ఇప్పించుచుండును

శ్లో. శబ్దాఖ్యమపరం బ్రహ్మ సందర్భేణ పరిష్కృతమ్,
విక్రీయతే కతిపయై ర్వృథాఽన్యై ర్వినియుజ్యతే. ౩౭

తా. పూర్వోత్తరసందర్భశుద్ధికలిగి అలంకారాది సకలగుణాలంకృతమయిన శబ్దబ్రహ్మమును కొందఱు ఏచిల్లిగవ్వకో ఆశపడి విక్రయించుచున్నారు. మఱికొందఱు అయోగ్యులవర్ణించి పాడుచేసికొనుచున్నారు గాని అట్టివిద్యకు అర్హమయిన పరమేశ్వరారాధనమునందు వినియోగించువారలుమాత్ర మరుదు.

శ్లో. వర్ణయంతి నరాభాసం వాణీం లబ్ధ్వాఽపి యే జనాః,
ప్రాప్యాపి కామధేనుం తే లాంగలే వినియుంజతే. ౩౮

తా. జన్మాంతరకృత పుణ్యవశముచేత లభించిన సత్కవిత్వమును పరమేశ్వరుని కొనియాడుటకయి వినియోగింపక నరాధములగువారల కొనియాడుటకయి ఉపయోగించువారలు తమకు సుకృతవిశేషముచేత కామధేనువు లభింపగా దానిసాహాయ్యమున సకలమనోరథములను పొందుటకు ప్రయత్నింపక ఆకామధేనువును నాగలికికట్టి దున్నెడి మూర్ఖునితో సమానులు.

శ్లో. ప్రశంసంతినరాభాసా న్ప్రలపంతోఽన్యథాఽన్యథా,
కథం తరంతి కవయః కామపారమ్యవాదినః. ౩౯

తా నోటికివచ్చినటుల నరాధములగు వారలయందు లేనిపోనిగుణముల నారోపించి పొగడుచు, ధర్మార్థకామమోక్షపురుషార్థములలో కామ్యపురుషార్థమే అన్నిటికంటె మిన్నయనివాదించు కవీశ్వరులు ఎన్నటికిని కడతేరఁజాలరు.

శ్లో. యత్సందర్భేయదుల్లేఖే యద్వ్యంగ్యే నిభృతం మనః,
సమాధే రపి తజ్జాయ శ్శంకరో యది వర్ణ్యతే. ౪౦

తా. ఏకవిత్వమునందు పదసందర్భవిచారము నిమిత్తమున్నూ, అలంకారముల నూహించుటయందున్నూ, ధ్వనివిచారము నిమిత్తమున్నూ మనస్సు నేకాగ్రముగా నిశ్చలముగా నుంచుకొనునో అట్టికవిత్వముచేత శ్రీశంకరుని వర్ణించునెడల అది సమాధియోగముకంటె మిన్నయగును.

గృహస్థులు.

శ్లో. గృహిణీ భగినీ తస్యాః శ్వశురో స్యాల ఇత్యపి,
ప్రాణినాం కలినా సృష్టాః పంచప్రాణా ఇమే ఽపరే. ౪౧

తా. కృతాదియుగములందు ప్రాణాదిపంచప్రాణములనుమాత్రమే ప్రాణులకుం డెనుగాని కలియుగమునందు మఱి యైదు ప్రాణములను ప్రాణులనిమిత్తము కలిపురుషుఁడు క్రొత్తగా నిర్మించినాఁడు:—భార్య, భార్యతోఁబుట్టువు, భార్యతండ్రి, భార్యతల్లి, భార్యసోదరుఁడు, ఈ యైదు క్రొత్తపంచప్రాణములు. కలియుగమునందు అన్నతమ్ములు తల్లితండ్రులు మున్నగు వారియందుకంటె భార్యాసంబంధులయందు ప్రీతి యధికముగానుండును

శ్లో. జామాతరో భాగినేయా మాతులా దారబంధవః,
అజ్ఞాతా ఏవ గృహిణాం భక్షయంత్యాఖువ ద్గృహే. ౪౨

తా. అల్లుండ్రు, మేనల్లుండ్రు, మేనమామలు, భార్యాసంబంధులు, అనువారలు ఇంటియందున్న పదార్థములను ఎలుకలు తినుచుండుగటుల గృహస్థునకు తెలియకుండగనే ఇంటిని గుల్లచేయుచుందురు.

శ్లో. మాతులస్య బలం మాతా జామాతు ర్దుహితా బలమ్,
శ్వశురస్య బలం భార్యా స్వయ మేవాతిథే ర్బలమ్. ౪౩

తా. ఇంటియందు మేనమామకుబలము తల్లి, అల్లునకుబలము కూతురు, మామగారికిబలము భార్య. అతిథిగావచ్చినవానికి తానేబలము, అనగా మేనమామ మున్నగువారికి కావలసినవానిని విచారించి యాదరించుటను తల్లి మున్నగువారలు చూచుకొందురుగాని అన్నార్థియైవచ్చిన యతిథి నాదరించుటకు ఎవ్వరు పూనుకొనరు వానివిషయమును గృహస్థే స్వయముగ విచారించుకొనవలయును.

అల్లుఁడు.

శ్లో. జామాతు ర్వక్రతా తావ ద్యావ త్స్యాలస్య బాలతా,
ప్రబుధ్యమానే సారళ్యం ప్రబుద్ధేఽస్మిన్ పలాయనమ్. ౪౪

తా. అల్లుని వక్రస్వభావమంతయు బావమరిది చిన్నవాఁడుగా నున్నంతకాలమే సాగుచుండునుగాని బావమరిది కొంచెముబుద్ధి తెలిసినకొలఁది అల్లునివక్రత్వము తగ్గుచుండును. బాగుగా బావమరిదికి బుద్ధివచ్చినతరువాత అల్లుని వక్రగుణములుమాత్రమే గాక అత్తింటనుంచికూడ అల్లుఁడు కాలాయన మొనర్చును.

శ్లో. భార్యా జ్యేష్ఠా శిశు స్స్యాల శ్శ్వశ్రూ స్స్వాతంత్ర్యశాలినీ,
శ్వశురస్తు ప్రవాసీతి జామాతు ర్భాగ్యధోరణీ. ౪౫

తా. తనభార్య అత్తమామలకు పెద్దకుమార్తెగా నుండుట, బావమరిది చిన్నవాఁడయి యుండుట, అత్తగారు గృహకృత్యములను స్వయముగ స్వతంత్రించి చేసికొనుచ దిగనుండుట, మామగారు దేశదేశములు తిరుగుచుండుట యనునవి ఒక్కొక్కటియే అల్లునియదృష్టసౌధమునకు సోపానములు.

## కూతురు.

శ్లో. భూషణై ర్వసనైః పాత్రైః పుత్రాణా ముపలాలనైః,
సకృదాగత్య గచ్ఛంతీ కన్యానిర్వాష్టి మందిరమ్. ౪౬

తా. ఆడుపడుచు పుట్టింటనుండి అత్తవారింటికి పోవుచున్నప్పుడు సొమ్ములనియు, వస్త్రములనియు, పాత్రలనియు, పిల్లలకని ఆసుకొనువస్తువులనియు ఇట్లు కంటికింపుగానుండు వస్తువులనెల్ల తనయత్తవారింటికి తీసికొనిపోవుచు ఇల్లునుడిచ్చి పెట్టుచున్నది.

## భార్య.

శ్లో. గృహిణీ స్వజనం న క్తి శుష్కాహారం మితాశనమ్,
పతిపక్ష్యాం స్తు బహ్వాశాః క్షీరపాః తస్కరా నపి. ౪౭

తా. ఇంటియిల్లాలు తన పుట్టినింటినుండివచ్చెడి చుట్టపక్కములు కలియో గంజియో కొద్దిగ త్రాగిపోవుచుందురనియు, భర్తయొక్క సంబంధులు పెరుగుపాలుపోసికొని మానెడు బియ్యపన్నమును దినుటయేగాక యిదిచాలక దొంగతిండినికూడ తినుచుందురనియు చెప్పుచుండును.

శ్లో. భార్యే ద్వే పుత్రశాలిన్యౌ భగినీ పతివర్జితా,
అశ్రాంతకలహో నామ యోగోఽయం గృహమేధినామ్. ౪౮

తా. బిడ్డలుగల ఇద్దఱుభార్యలును, అధీనముతప్పి పుట్టింటికిచేరిన తోడబుట్టువుండుటయు, ఈరెండును గృహస్థులకు అశ్రాంత కలహాయోగమునకు సాధనమగును.

శ్లో. ద్వే భార్యే బహవః పుత్రాః దారిద్ర్యం రోగసంభవః,
జీర్ణౌచ మాతాపితరౌ వేకైకం నరకాధికమ్. ౪౯

తా. ఒక మనుష్యునకు ఇద్దఱు భార్యలుండుట, బిడ్డలు అనేకులుండుట, దారిద్ర్యము, రోగమువచ్చుట, తల్లిదండ్రులు ముసలివారలైయుండుట అనునవి ఒక్కొక్కటియే మరణముకంటె ఎక్కుడు కష్టమునొసంగును.

## ఋణదాత.

శ్లో. స్మృతే సీదంతి గాత్రాణి దృష్టే ప్రజ్ఞాఽపి నశ్యతి,
అహో మహా దిదం భూతం ఉత్తమర్ణాభిశబ్దితమ్. ౫౦

తా. అప్పులవానిపేరు తలంచినంతమాత్రమున దేహము కంపమెత్తును. చూచిన యెడల తెలివితప్పును. కనుక ఋణదాతయనువాఁడు నిజముగా పెద్దభూతమనియే చెప్పవలయును. దయ్యమునుచూచిన దేహము కంపించును. మైకమువచ్చును కనుక దయ్యమునకును ఋణదాతకును భేదములేదు.

శ్లో. అంతకోఽపిహి జంతూనా మంతకాల మపేక్షతే,
నకాలనియమః కశ్చి దుత్తమర్ణస్య విద్యతే ౫౧

తా. సకలభూతముల ప్రాణముల నపహరించెడి యముఁడయినను మృత్యుకాలము సమీపించినప్పుడు మాత్రమే జనుల పీడించును గాని ఋణదాతయగువాఁడు మాత్రము కాలనియమములేక యెప్పుడుతలచిన అప్పుడే అప్పుపుచ్చుకొన్నవానిని యమబాధలుపెట్టును

శ్లో. న పశ్యామో ముఖే దంష్ట్రాం న పాశం వా కరాఞ్చలే,
ఉత్తమర్ణ ముపేక్ష్యైన తథాఽప్యుద్విజతే మనః. ౫౨

తా. యమధర్మరాజు ముఖమునందున్న కోరలు అప్పులవానిముఖమున కోరలులేవు చేతపాశములేదు. అయినను అప్పులవా నిచూడగనే అప్పు పుచ్చుకొన్నవానిమనస్సు కలతఁజెందును.

దారిద్ర్యము.

శ్లో. శత్రౌ సాంత్వం ప్రతీకారః సర్వరోగేషు భేషజమ్,
మృత్యౌ మృత్యుంజయధ్యానం దారిద్ర్యేతు నకించన. ౫౩

తా. శత్రువునకు కోపమువచ్చినయెడల మంచిమాటచేత వాడు శాంతించును. రోగమునకు మంచిమందుతిన్నయెడల శాంతించును మృత్యుంజయధ్యానమువలన మృత్యుబాధతొలఁగును. కాని దారిద్ర్యనివారణార్థము ప్రతీకార మేమియు లోకమునలేదు.

శ్లో. శక్తిం కరోతి సంచారే శీతోష్ణ మర్షయత్యపి,
దీపయత్యుదరే వహ్నిం దారిద్ర్యం పరమౌషధమ్. ౫౪

తా. దారిద్ర్యమనెడి మంచిమందు దేశములు తిరుగుటకు శక్తిని కలుగఁజేయును చలివలనను, యెండవలనను కలిగెడిబాధను సహింపఁజేయును. జఠరాగ్నిని బాగుగ ప్రజ్జ్వలింపఁజేయును.

శ్లో. గిరం స్ఖలంతీం మీలంత్యౌ దృశౌ పాదౌ విసంస్థులౌ,
ప్రోత్సాహయతి యాచ్ఞాయాం రాజాజ్ఞేవ దరిద్రతా. ౫౫

తా. దారిద్ర్యము రాజాజ్ఞతో సమానమయినది ఏలయనఁగా రాజాజ్ఞకు భయంపడినవాఁడు మాటమాట్లాడునప్పుడు తొట్రుపాటుపడుచు, కన్నులను మూసుకొనుచు, కాళ్ళువడఁకుచు ప్రభువును ప్రార్థించును. అట్లే దరిద్రుఁడును పరులను యాచింపఁబోయినప్పుడు మాట తబ్బిబ్బుతో కన్నులుమూసుకొని కాళ్ళు గడగడవడకుచు యాచించును గనుక దారిద్ర్యమునకు రాజాజ్ఞకును సమానత్వము ఇట చెప్పఁబడినది.

శ్లో. జీర్యంతి రాజవిద్వేషాః జీర్యంత్యవిహితాన్యపి,
ఆకించనస్యబలాఢ్యానా మంతతోఽశ్నాపి జీర్యతి. ౫౬

తా. అతి బలవంతులగువారలు రాజవిద్వేషముగ చరించినను, రాజాజ్ఞకు విధేయతను గనంబఱచకపోయినను వారియంగురాజు ఉపేక్షనువహించునటుల అతిదారిద్ర్యముగలవారలు రాజద్రోహకృత్యము నాచరించినను, అవిధేయతను గనంబఱచినను రాజులుపేక్షించుచుందురు. సమర్థులగు వారలతో విరోధమేల యని బలవంతులగువారలు అవిధేయతను గనంబఱచిన సుపేక్షింతురు బలహీనులు అవిధేయతను గనంబఱచిన యెడల ఈబిచ్చగాడు మనల నేమిచేయఁగలఁడని యలక్ష్యముతో నుపేక్షను గనంబఱచెదరు చివరకు రాయికూడ దరిద్రునకు జీర్ణమగును.

శ్లో. నాస్య చోరా న పిశునా న దాయాదా న పార్థివాః,
దైన్యం రాజ్యాదపి జ్యాయో యది తత్త్వం విబుధ్యతే. ౫౭

తా. దరిద్రునకు దొంగలవలనగాని, కొండెగాండ్లవలనఁగాని, దాయాగులవలనఁగాని, రాజులవలనగాని భయమనునదియేలేదు. కావున యథార్థముగ విచారించిచూచిన దొంగలవలనను, కొండెగాండ్లవలనను, దాయాగులవలనను, శత్రురాజులవలనను యెప్పటికప్పుడు భయము కలుగుచుండెడి రాజ్యముకంటె దారిద్ర్యమే ఉత్తమమయినది.

సంపద.

శ్లో. ప్రకాశయత్యహంకారం ప్రవర్తయతి తస్కరాన్,
ప్రోత్సాహయతి దాయాదాన్ లక్ష్మీః కించి దుపస్థితా. ౫౮

తా. నడుమంత్రపుసంపద కొద్దిగావచ్చినయెడల వానికి వెంటనే అహంకారము విజృంభించును దొంగలు సమయమెప్పుడు దొరకునాయని కనిపెట్టుచుందురు దాయాదులువేధింపఁ దలపడుదురు

శ్లో. విడంబయంతి యే నిత్యం విముగ్ధా ధనినో జనాన్,
తఏవతు విడంబ్యంతే శ్రియా కించి దుపేక్షితాః. ౫౯

తా. ఏమనుష్యులు మూఢులగు ధనవంతులఁగాంచి (వీరికి యుక్తాయుక్తపరిజ్ఞానములేదు అను మున్నగురీతిగ) పరిహసించుచుందురు గాని అట్టి పరిహసించువారలు తమకు కొంచెము లక్ష్మీకటాక్షముకలుగఁగానే ఇతరులచేత పరిహసింపఁబడుచుందురు. అనగా ధనములేనప్పుడు గల యుక్తాయుక్తపరిజ్ఞానము ధనమున్నప్పు డుండదనిభావము.

శ్లో. ప్రామాణ్యబుద్ధి స్తోత్రేషు దేవతాబుద్ధి రాత్మని,
కీటబుద్ధి ర్మనుష్యేషు నూతనాయాః శ్రియః ఫలమ్. ౬౦

తా. తన్ను ఇతరులు కొనియాడుచున్న స్తోత్రపాఠములు యథార్థములనియు, తానే దేవుఁడననియు, తనకంటెవేఱయిన మనుష్యులందఱు పురుగులనియు ననుభావము నడుమంతరపు సిరివచ్చినవానికి ఏర్పడును. అనగా పుట్టుకతో సంపదలేక చెడిబ్రతికిన వానికి స్వాతిశయమెక్కుడని భావము.

శ్లో. శృణ్వంత ఏవ పృచ్ఛంతి పశ్యంతోఽపి స జానతే,
విడంబనాని ధనికాః స్తోత్రాణీత్యేవమన్వతే. ౬౧

తా. ధనికులు తమ్ముగూర్చి ఇతరులు గట్టిగా మనవిచేసికొనుచున్నను విననివారివలె "ఏమి మఱల చెప్పుము" అని పలుకుచుందురు. కన్నులముందఱనే ఆవిషయము జరుగుచున్నను తెలియనిదానివలె నుందురు. ఇతరులు తమ్ము పరిహాసమొనర్చుచున్నను వారు కొనియాడుచున్నారని తలంతురు. అనగా నడుమంతరపుసిరివలన వివేకము నశించుననుట.

శ్లో. అనృత్య శ్రీమదేనాంధా నన్యోన్యకృతసంవిదః,
స్వైరం హసంతి పార్శ్వస్థా బాలోన్మత్తపిశాచవత్. ౬౨

తా. ధనమదముచేత కన్నులుపూడిపోయి పొంతలుకప్పి ఆయుక్తకార్యము లాచరించువారలను చుట్టుప్రక్కలనున్న జనులు ఒకరికొకరు సంకేతముగా మాట్లాడుకొనుచు బాలురను, పిచ్చివారలను, దయ్యముపట్టినవారలను చూచి నవ్వునట్లు యథేచ్ఛగా నవ్వుచుందురు. (బాలోన్మత్తపిశాచగ్రస్తులితరులుచేయు పరిహాసము నెఱుంగజాలనట్టుల ధనమదాంధులుకూడ తమ యకృత్యములఁగాంచి ఇతరులు పరిహసించుట నెఱుంగజాలరనుట.)

శ్లో. స్తోతవ్యైః స్తూయతే నిత్యం సేవనీయైశ్చ సేవ్యతే,
నబిభేతి న జిహ్రేతి తథాఽపి ధనికో జనః. ౬౩

తా. ధనముగలవాఁడు తాను యెవ్వరిని స్తోత్రముచేయవలయునో అట్టివారలచేత తాను స్తోత్రముచేయఁబడుచున్నవాఁడైనను భయుంపఁడు. తానెవ్వరికి పరిచర్యచేయవలయునో అట్టివారలచేత తాను సేవింపఁబడుచు యీ యకృత్యమునుచూచి సిగ్గుపడఁడు. (అనఁగా ధనికునకుయుక్తాయుక్తపరిజ్ఞానము నశించుననుట)

శ్లో. క్షణమాత్రం గ్రహావేశో యామమాత్రం సురామదః,
లక్ష్మీమదస్తు మూర్ఖాణా మాదేహ మనువర్తతే. ౬౪

తా. దయ్యముపట్టినయెడల దానియావేశము క్షణకాలముండిపోవును. కల్లుత్రాగిన కలిగెడికైపు యొకజాముసేపుండును. కాని మూర్ఖులకువచ్చిన ఐశ్వర్యమదము మాత్రము ఆమరణాంతము వారిని వదలజాలదు.

శ్లో. శ్రీర్మాస మర్ధమాసం వా చేష్టిత్వా వినిర్గతే,
వికారస్తు తదారబ్ధో నిత్యో లశునగంధవత్. ౬౫

తా. సంపద నెలయో, పదియేనురోజులో నుండిపోవునుగాని ఆసంపదవచ్చినప్పుడువచ్చిన ఐశ్వర్యమదముమాత్రము ఉల్లికంపువలె యెల్లప్పుడు స్థిరముగానుండును. నడుమంతరపుసిరి వచ్చినవారికవచ్చిన ఐశ్వర్యమదము ధనముపోయినపిదపకూడ పోక మరణమువఱకు వారి నంటియుండుననుట.

శ్లో. కంఠేమదః కోద్రవజః హృది తాంబూలజో మదః,
లక్ష్మీమదస్తు సర్వాంగే పుత్రదారముఖేష్వపి. ౬౬

తా. అరికయన్నమును తిన్నయెడల ఆయన్నము జీర్ణించుదనుక గొంతులో ప్రదక గ్రుచ్చుకొన్నటుల నుండును కనుక ఆమదము గొంతునందే యుండును. తాంబూలము వేసికొన్నయెడల సాక్షాత్తుగ వశ్యాదు అది లోమ్మున అనుచునటులనుండును ఐశ్వర్య ముచేతవచ్చిన మదవికారము దేహమునంగుండు సకలావయవములందేగాక అధికుని యొక్క పుత్రులు, భార్య మున్నగు వారిముఖములయందున్నూ గనంబడుచుండును ధన వంతునియొక్క భార్యాపుత్రాగులయందుకూడ ఐశ్వర్యమదమత్తత గనబడుచుండునమట

శ్లో. యత్రాసీ దస్తివా లక్ష్మీ స్తత్రోన్మాదః ప్రవర్తతామ్,
కులేఽప్యనతరత్యేషా కుష్ఠాపస్మారవత్కథమ్. ౬౭

తా. ఎవనికి ఇదివఱకు ధనముండెనో, లేక ఇప్పుడుధనమున్నదో వానియందీధన మదోన్మాదముండుఁగాక. కాని యీధన మదోన్మాదము కుష్ఠము, అపస్మారము మున్న గు రోగములవలె వంశమునందుకూడ సంక్రమించుచున్నదే! ఇందులకు కారణమేమి? తనకు తినతిండిలేకపోయినను "తమతాత కోటీశ్వరుఁడని" చెప్పుకొనుచు విఱ్ఱవీగుచుం డువారలు కూడ లోకమునందు పలువురుగలరని భావము.

శ్లో. అధ్యాపయంతి శాస్త్రాణి తృణీకుర్వంతి పండితాన్,
విస్మారయంతి జాతిం స్వాం వరాటాః పంచషాః కరే. ౬౮

తా. కొందఱు నీచులు చేతిలో ఐదారుగవ్వలు చేరగానే పండితులయినవారలను గడ్డిపోచనుచూచినటుల చూచుచు తామే సకలశాస్త్రములనెఱింగినవారివలె శాస్త్రార్థ ములను లోకులకు బోధించుచు తానుజన్మించిన కులమేదియో యను విషయమునుకూడ మఱచిపోవుచుందురు.

శ్లో. బిభర్తు భృత్యం ధనికః దత్తాం వా దేయమర్థిషు,
యావద్యాచకసామర్థ్యం తావల్లోకో న మృష్యతి. ౬౯

తా. ధనికుఁడగువాఁడు సేవకులను పోషించుఁగాక. యాచకులకు తగినటులనో సంగి సత్కరించుఁగాక. అయినను ఉన్నదంతయు ఇతరులకొసంగి అతఁడుకూడ యా చకునితో సమానుఁడయినఁగాని వానిని లోకులుమన్నింపరు.

కొండెగాండ్లు.

శ్లో. ధనభారోహి లోకస్య పిశునై రేవ ధార్యతే,
కథం తే తల్లఘూకర్తుం యతంతే పరధాన్యతః. ౭౦

తా. ధనికులగువారలవద్దనుండు ధనము యొక్క భారమును పిశునులగువారలు

(అనఁగా ఓర్వలేనివారలు) పొఁగుచున్నటుల తోఁచుచున్నది. అట్లుండుటచేతనే ఇత రులదగ్గఱయున్న ధనభారమును తగ్గించుటకు తామెక్కుడు శ్రమంపడుచుందురు అనగా ఇతరులధనమునుగాంచి యోర్వజాలరని భావము.

శ్లో. శ్రమానుగూపం పిశునః కిముపక్రియతే నృపైః,
ద్విగుణం త్రిగుణం వాఽపి కృతాంతో లాలయిష్యతి. ౭౧

తా. ఇతరులపైన లేనిపోని చాడీలను రాజులతోచెప్పి వారియందు రాజులకు వై ముఖ్యమును పుట్టించునట్టి కొండెగాండ్లకు రాజు తగిన బహుమానమును చేయఁజాలఁడు గాని ఆశ్రమకు ఇబ్బడిగానో మూబ్బడిగానో తగినసన్మానమును యమధర్మరాజు చే యఁగలఁడు.

శ్లో. గోకర్ణే భద్రకర్ణేచ జపో దుష్కర్మనాశనః,
రాజకర్ణేజప స్సద్యః సర్వకర్మవినాశనః. ౭౨

తా. గోకర్ణక్షేత్రమునందుఁగాని భద్రకర్ణక్షేత్రమునందుఁగాని మంత్రజపము సలిపినయెడల పాపజాలమంతయు నశించును. రాజులయొక్క కర్ణములందు జపము సలు పుచుండినయెడల పనులన్నియుఁ జెడును.

శ్లో. నస్వార్థం కించి దిచ్ఛంతి నప్రేర్యంతే చకేనచిత్,
పరార్థేషు ప్రవర్తంతే ఖలా స్సంత శ్చ తుల్యవత్. ౭౩

తా. దుష్టులున్ను సత్పురుషులున్ను స్వలాభము నపేక్షింపకయే ఒకరి ప్రేరేపణ లేకయే ఇతరులవిషయమయి ప్రవర్తించుచున్నారు. అయితే సత్పురుషులు తమ్ముల నిత రులుకోరక పోయినను వారికి మేలుచేయుటకు నిగపేక్షబుద్ధితో ప్రవర్తించెదరు. దుర్మా ర్గులు తమకు నష్టములేకపోయినను ఇతరుల కపకారమొనర్ప ప్రయత్నింతురు. ఇదియే ఇరువురులకు గల భేదము.

శ్లో. కాలాంతరేహ్యనర్థాయ గృధ్రో గేహోపరి స్థితః,
ఖలో గృహసమీపస్థ స్సద్యోఽనర్థాయ దేహినామ్. ౭౪

తా. ఇంటిమీద గుడ్లగూబ యున్నను పక్షి నిలిచిన యెడల కొంతకాలమునకు చెరుపు సంభవించుననుట శాస్త్రప్రసిద్ధముగాని దుష్టుఁడు ఇంటికి సమీపముననున్నను వెంటనే అనర్థము గలిగించుటమాత్రము జగత్ప్రసిద్ధము.

## లోభులు.

శ్లో. శుష్కోపవాసో ధర్మేషు భేషజ్యేషుచ లంఘనమ్,
జపయజ్ఞశ్చ యజ్ఞేషు రోచతే లోభశాలినే. ౭౫

తా. లుబ్ధులగువారలకు ధర్మములందు శుష్కోపవాసమున్ను, రోగచికిత్సలయందు లంఘనచికిత్సయు, యజ్ఞములందు జపయజ్ఞమున్ను సర్వోత్తమములుగాఁ గనంబడును.

శ్లో. కింవక్ష్యతీతి ధనికా ద్యావ దుద్విజతే ఽధనః,
కింప్రక్ష్యతీతి లుబ్ధోఽపి తావ దుద్విజతే తతః. ౨౬

తా. దరిద్రుఁడగువాఁడు ధనికుని యాచించుటకుఁ బోయినప్పుడు వాఁడేమి చెప్పునోయని భయంపడుచుండును యాచకునిచూచి లోభియు వీఁడేమియడుగునో యని భయంపడుచుండును.

శ్లో. సర్వమాతిథ్యశాస్త్రార్థం సాక్షాత్కుర్వంతి లోభినః,
భిక్షాకబళ మేకైకం యేహి పశ్యంతి మేరువత్. ౨౭

తా. లోభులయినవారలు అతిథిపూజనుగూర్చి శాస్త్రములందు చెప్పఁబడిన విషయమునంతయు స్వయముగా తామనుభవించుచున్నారు. అతిథికిపెట్టిన ఒక్కొక కబళము మేరువుతో సమానమయినది అని శాస్త్రములందు చెప్పబడియున్నది కావున అట్టి కబళమును మేరువుగాతలంచి అతిథులకు పెట్టుటకు మనసొప్పకుందురు.

శ్లో. ధనపాలః పిశాచోఽపి దత్తే స్వామిన్యుపాగతే,
ధనలుబ్ధః పిశాచస్తు న కస్మైచన దిత్సతి. ౨౮

తా. నిక్షేపాదికమును కాపాడెడి పిశాచము అధనముపొందుటకు అర్హుఁడయిన వాఁడు వచ్చినయెడల వానికి ఆధనము నొసఁగును కాని ధనలోభియగు పిశాచము మాత్రము ఎవ్వరికిని తృణమయిన నిచ్చుటకు సమ్మతింపఁడు.

శ్లో. దాతారో ఽర్థిభి రర్థ్యంతే దాతృభిః పున రర్థినః,
కర్తృకర్మవ్యతీహారా దహో నిమ్నోన్నతం కియత్. ౨౯

తా. యాచకులచేత ఇప్పుడు దాతలు అర్థింపఁబడుచున్నారు. కొంతకాలమునకు మఱల నీదాతలు ఆయాచకులనే యాచించుచున్నారు. ఇప్పుడు దాతయయినవాఁడు మఱొకప్పుడు యాచకుఁ డగుచున్నాఁడు. ఈకర్మకర్తృత్వములయొక్క మార్పువల్లనే ఎచ్చుతగ్గులు యేర్పడుచున్నవి ఇది యాశ్చర్యముగదా.

శ్లో. స్వస్మిన్నసతి నార్థస్య రక్షక స్సంభవే దితి,
నిశ్చిత్యైవ స్వయ మపి భుంక్తే లుబ్ధః కథంచన. ౩౦

తా. తాను జీవించియుండనియెడల తన ధనమును రక్షించువాఁడు లేకపోవునని తలంచియే లోభియగువాఁడు తన దేహధారణకు తగినంత యన్నమును మాత్రము అతి కష్టముమీద తినుచున్నాఁడు.

శ్లో. ప్రస్థాస్యమానః ప్రవిశే త్ప్రీతిశ్శ్రేష్ఠ దినేదినే,
విచిత్రాన్నల్లిఖే ద్విఘ్నాన్ తిష్ఠాసు రతిథిశ్చిరమ్. ౩౧

తా. పొఱుగిండ్లతినమరిగినవాఁడు ఒకరింటికి అతిథిగాఁబోయి అచటనేకాలూ

నకొని పొట్టఁబోసుకొన దలచినవాఁడయి ఇంటివారలు పొమ్మని చెప్పినప్పటికిన్ని యెప్పటికిన్నీ బయలుదేరడు పిల్లి దుశ్శకునమాయెననియు, మఱునాఁడు తుమ్మి రనియు, ఆమరునాఁడు ఒంటిబ్రాహ్మణుఁ డెదురాయెననియు, లేనిపోని విఘ్నములు కల్పించి చెప్పుచు కదలకయుండును.

## డాంబికులు.

శ్లో. ఘటకం సమ్యగారాధ్య వైరాగ్యం పరమం వదేత్,
తావదర్థాః ప్రసిధ్యంతి యావచ్చాపల మాన్వృతమ్. ౮౨

తా. ఘటకుఁడనువానిని మాత్రము చక్కఁగా చేర్చుకొని వానిని బాగుగా సత్కరించి తనకు ధనమునం దాశలేనట్లు నటించుచుండు నెడల ద్రవ్యము నెంతయైన గడించవచ్చును ఆత్రపడి తనకుంగల ధనాశను తానే వెల్లడించిన కార్యము చెడిపోవును (ఘటకుఁడనఁగా రాజునుగాని ధనికునిగాని చూపించి పరిచయము కలిగింపఁ చేసి ద్రవ్యమును ఆర్జించుటకు దారిచూపి ఆద్రవ్యమునందు కొంతభాగము తాను గ్రహించువాఁడు).

శ్లో. ఏకత స్సర్వశాస్త్రాణి తులసీకాష్ఠ మేకతః,
న స్తవ్యం కించి దత్యుక్తం వస్తుత స్తులసీవరా. ౮౩

తా శాస్త్రములన్నియు ఒకయెత్తు, తులసికట్టె, (తులసిపూసలమాల) ఒకయెత్తు అనిచెప్పఁబడియును ఆలోచించిచూచినయెడల తులసిమాలయే మిన్నయగును. శాస్త్రాలు చదివి సంపాదించుటకంటె మెడనిండ తులసిమాలల వేసికొన్నయెడల ద్రవ్యము నెక్కుడు గడించవచ్చునని భావము )

శ్లో. విస్మృతం బాహటేనేదం తులస్యాః పరతా గుణాః,
విశ్వసంమోహినీ విత్తదాయినీతి గుణద్వయమ్. ౮౪

తా. తులసియొక్క గుణములను వర్ణించిచెప్పినట్టి బాహటుఁడు తులసియందుగల "ప్రపంచమును మోహింపఁజేయును, ధనమునిచ్చును." అను గుణద్వయమును చెప్పమరిచినాఁడు.

శ్లో. ప్రదీయతే విదుష్యేకం కవౌ దశ నటే శతమ్,
సహస్రం డాంభికే లోకే శ్రోత్రియే నతు కించన. ౮౫

తా. లోకులు (తమదగ్గఱకు శాలువమడత బుజానవేసికొన్న) శాస్త్రి యాచనకు వచ్చిన వాని కొకరూపాయినిత్తురు. (తమపేరు పద్యములతో చేర్చి చదువుచు) కవియను వాఁడువచ్చి యాచించిన పదిరూపాయీలనిత్తురు. నాట్యగాడువచ్చి యాచించిన నూటపదియాల్లు సంభావన లొసంగుదురు డాంబికుఁడువచ్చి పటాటోపమొనర్చిన వేయిని

నూటపదియారులు ఇచ్చి సాష్టాంగనమస్కారము లొనర్తురు 'ఇత్యావా' యనుచు శ్రోత్రియుఁడువచ్చి యాచించిన వానిమాఱుచూడక అర్ధచంద్రప్రహారము నొసంగ సిద్ధపడుదురు. (కలియుగమునందు పెద్దలుచూచి సత్కరించువార లుందురుగాని యోగ్యతను గాంచి సత్కరించువారలు మాత్రము గనంబడరనిభావము)

శ్లో. కౌపీనం భసితాలేపో దర్భా రుద్రాక్షమాలికాః,
మౌన మేకా సికాచేతి మూర్ఖసంజీవనాని షట్. ౪౬

తా. గోచిపెట్టుకొనుట, దేహమునిండ బూదిబూసుకొనుట, వ్రేలికి దర్భపవిత్రముధరించుట, మెడనిండ రుద్రాక్షమాలలు వేసికొనుట, మౌనవ్రతము, కదలక మెదలక కూర్చుండుట, యీ యాఱుకృత్యములు మూర్ఖునిబ్రతుకు దెరువునకు మంచి యుపాయములు.

శ్లో. వాసః పుణ్యేషు తీర్థేషు ప్రసిద్ధశ్చ మృతో గురుః,
అధ్యాపనావృత్తయ శ్చ కీర్తనీయా ధనార్థిభిః. ౪౭

తా. లోకులనుండి ధనమును అనాయాసముగ సంపాదింపఁదలంచినఁ యాచకులు "తాము కాశీక్షేత్రమునందు నివసించువారము" అనియు, కాశీక్షేత్రమునందేగాక జగమునందంతటను ప్రసిద్ధిగాంచిన గంగాధరశాస్త్రిగారు తమకు విద్యాగురువులనియు, మీవంటివారివలన లభించిన ధనమువలన విద్యార్థుల కన్నపానము లిచ్చుచు కాశీక్షేత్రవాస మొనర్చుచు శాస్త్రముల బోధించుటయే తమవృత్తియనియు, చెప్పుచుండవలయును. (దీనివలన గౌరవము ధనలాభముకూడ కలుగునని భావము)

శ్లో. మంత్రభ్రంశే సంప్రదాయః ప్రయోగ శ్చ్యుతసంస్కృతౌ,
దేశధర్మ స్త్వనాచారే పృచ్ఛతాం సిద్ధముత్తరమ్. ౪౮

తా. డాంబికులగువారలు తాముచెప్పెడి మంత్రమునందు స్వరవర్ణాదిలోపముల నితరులుకనిపెట్టి ఇదియేమియని యడిగిన ఇదియే మాసంప్రదాయపాఠమనియు, క్రియాలోపము సంభవించెనని ఎవ్వరైన నడిగిన యీ ప్రయోగ మిట్లేయుండవలయుననియు, ఏమి యిట్లనాచారము చేయుచున్నారని యడిగిన 'మాదేశాచార మిట్లే' యనియు తడుపుకొనక సమాధాన మిచ్చుచుందురు.

శ్లో. యథా జానంతి బహవో యథా వక్ష్యంతి దాతరి,
తథా ధర్మం చరేత్సర్వం నవృథా కించి దాచరేత్. ౪౯

తా. ధనము గణింపఁదలంచినవాఁడు "తానుచేయు వ్రతనియమాదులు అనేకులకు తెలియునట్లుగను, ఆ తెలిసికొన్నవారలు తన మాహాత్మ్యమును ధనికుఁడగు దాత దగ్గఱ చెప్పునట్లుగను ఆచరింపవలయును గాని ఇతరులకు తెలియకుండునటుల ఏకార్యమును చేయఁగూడదు.

శ్లో. సదా జపపటో హస్తే మధ్యే మధ్యే ఽక్షిమీలనమ్,
సర్వం బ్రహ్మేతివాదశ్చ సద్యః ప్రత్యయహేతవః. ౯౦

తా. చేతియం దెల్లప్పుడు జపవస్త్రము, నడుమనడుమ కన్నులు మూసుకొనుట, 'సర్వంబ్రహ్మ' యని చెప్పుచుండుట. ఇవి 'మహాత్ముఁడు' అని అప్పుడే నమ్మకము పుట్టించుటకు నిమిత్తము లగుచున్నవి.

శ్లో. ఆమధ్యాహ్నం నదీవాస స్సమాజే దేవతార్చనమ్,
సతతం శుచివేషశ్చ త్వేత ద్దంభస్యలక్షణమ్. ౯౧

తా. మధ్యాహ్నము వఱకు నదీతీరమున నుండుట, (ఇట్లున్నయెడల స్నాన, సంధ్యా, జప, బ్రహ్మయజ్ఞాదుల నిష్ఠతో నాచరించువాఁడని లోకులు తలంచెదరు) పదుగురు చేరియున్నప్పుడు దేవతార్చనము సలుపుట. ఎల్లప్పుడు మడికట్టుకొనిన వానివలె నుండుట. ఇవి డాంబికునకు బ్రతుకుతెరువులు.

శ్లో. తావదీర్ఘ [redacted] ర్యకర్మ యావత్స్యా ద్ద్రష్టృమేళనమ్.
తావత్సంక్షిప్యతే సర్వం యావ ద్ద్రష్టా న విద్యతే. ౯౨

తా. తానుచేయు సంధ్యాజపాదులు చూచువార లుండునంతవఱకు చేయుచునే యుండవలయును. చూచువారలు లేనప్పుడు వెంటనే [redacted]ల సంక్షేపింపవలయును. ఇది డాంబికుల లక్షణము.

శ్లో. ఆనందబాష్పరోమాంచౌ యస్య స్వేచ్ఛావశంవదౌ,
కిం తస్య సాధనై రన్యైః కింకరా స్సర్వపార్థివాః. ౯౩

తా. ఎవనికి తలచినవెంటనే ఆనందబాష్పములు, రోమాంచము గగుర్పొడుచుట స్వాధీనములయి వచ్చుచుండునో అట్టివానికి ఉపాయాంతరములతో నపేక్షలేకయే రాజాధిరాజులందఱు వానికి దాసానుదాసులయ్యెదరు.

శ్లో. వికుర్వంతే దండ్యమానాః లాల్యమానా స్తత స్తరామ్,
దుర్జనానా మతో న్యాయ్యం దూరాదేవ విసర్జనమ్. ౯౪

తా. దుర్జనులను శిక్షించినయెడల సమయము కనిపెట్టి యపకారము చేయఁదలఁచుదురు. దగ్గఱచేర్చి బుజ్జగించుచుండిన అంతకంటె మిక్కిలిగ యపకార మొనర్తురు. కావున దుష్టులను దూరముగ తొలగియేయుండుట మంచిది

శ్లో. అదాన మీషద్దానం చ కించి త్క్రోధాయ దుర్ధియామ్,
సంపూర్ణదానం ప్రకృతి ర్వారామో వైరకారణమ్. ౯౫

తా. దుష్టుల కివ్వకపోయినను కొద్దిగ యిచ్చినను వారు కోపపడుదురు. బాగుగ నొసంగిన వారిస్వభావము గినంబఱుతురు. (అనగా ఉపకారికికూడ సమయము చూచి

యపకారమ్ము నొనర్తురు) ఇచ్చుచు నిలిపినయెడల విరోధింతురు. (అనఁగా దుష్టులగువారలెట్లయినను ఇతరుల ధనమును వీలయినంతవఱకు హరింపవలయునని చూచుచుందురుగాని శక్తికొలదియిచ్చిరని సంతోషముగాని బాగుగనిచ్చిరని కృతజ్ఞులయియుండుటగాని శక్తియున్నప్పుడిచ్చినారు ఇప్పుడివ్వకపోతే మాత్రమేమియని విశ్వాసమునుగాని కలిగియుండరని భావము.)

శ్లో. జ్యాయా నస[illegible] స్తవో దుష్టై ర్దీర్ఘాయై సంస్తవః పునః,
ఆపత్యసంబంధవిధి స్త్వనర్థాయైవ కేవలమ్. ౯౬

తా. దుర్జనులతో సహవాసముచేయకపోవుట శ్రేష్ఠము. పరిచయము పెట్టుకొన్నయెడల అది క్రమక్రమముగ అనూయకు కారణమగును. ఇఁక దుర్జనులలో వివాహసంబంధమును కలుగఁజేసికొన్నయెడల తనకనర్థమును తానే చేసికొన్నటులగును.

శ్లో. జ్ఞాతేయం జ్ఞానహీనత్వం పిశునత్వం దరిద్రతా,
మిళంతి యది చత్వారి తద్దిశేఽపి నమోనమః ౯౭

తా. జ్ఞాతిత్వము, జ్ఞానవిహీనత, ఓర్వలేమి, దారిద్ర్యము, ఈనాల్గు ఒకచోట చేరియున్నయెడల ఆదిక్కునకుకూడ వేయినమస్కారము లొనర్చవలయును. అనఁగా అట్టితావున నున్నయెడ[illegible]ము గలుగును

శ్లో. పరచ్ఛిద్రేషు హృదయం పరవార్తాసు చ శ్రవః,
పరమర్మసు వాచంచ ఖలానా మసృజ ద్విధిః. ౯౮

తా. బ్రహ్మదేవుఁడు దుర్మార్గులమనస్సును, పరచ్ఛిద్రాన్వేషణము నిమిత్తమున్ను, చెవులను పరవృత్తాంతశ్రవణ నిమిత్తమున్ను, వాక్కును పరులమర్మముల వారి శత్రువులకు చెప్పునిమిత్తమున్ను సృజించినాఁడు. (అనగా దుష్టులు పరచ్ఛిద్రములనే సర్వదాకనిపెట్టుచు పరులేమిమాట్లాడెదరో యని పొంచుండివినుచు వారిరహస్యమును వారిశత్రువులకు తెలిపి సంకటముల సమకూర్చుచుందురని భావము )

శ్లో. విషేణ పుచ్ఛలగ్నేన వృశ్చికః ప్రాణినా మివ,
కలినా దశమాంశేన కాల స్సర్వోఽపి దారుణః. ౯౯

తా. తేలు కొండియందున్న విషముచేత ప్రాణులకు భయంకరమయి తోచుచున్నటుల పదియవయంశము జరుగుచున్న యీకలికాలముచేత కాలమంతయు భయంకరమయి తోఁచుచున్నది.

శ్లో. యత్ర భార్యాగిరో వేదాః యత్ర ధర్మో ఽర్థసాధనమ్,
యత్ర స్వప్రతిభా మానం తస్మై శ్రీకలయే నమః. ౧౦౦

తా. ఏకాలమునందు భార్యయొక్కమాటలే వేదవాక్యము లగుచున్నవో, ఏకాల

మునందు ధర్మాచరణమే ధనార్జనకు సాధనభూతమయి వెలయుచున్నదో, ఏకాలము నందు తనకు తోఁచినదియే శాస్త్రప్రమాణముగా భావింపఁబడుచున్నదో అట్టి కలికాలమునకు ఒక్కనమస్కారము.

శ్లో. కామం వశస్తు జగత్సర్వం కాలస్యాస్యవశంవదమ్,
కాలకాలం ప్రపన్నానాం కాలః కిం నః కరిష్యతి. ౧౦౧

తా. ఈప్రపంచమంతయు కాలాధీనమయియున్న విషయము సత్యమే అయినను కాలునకుకూడ కాలుఁడయి వెలయుచున్న శ్రీమృత్యుంజయుని భక్తులమగు మమ్ముల నీకాలుఁ డేమిచేయఁగలఁడు?

శ్లో. కవినా నీలకంఠేన కలే రేతద్విడంబనమ్,
రచితం విదుషాం ప్రీత్యై రాజాస్థానానుమోదనమ్. ౧౦౨

తా. నీలకంఠదీక్షితుఁడను కవిచేత ఈకలివిడంబనశతకము రాజసభలయందు ఆమోదమునందురీతిగ విద్వత్ప్రీతికొఱకు రచింపఁబడినది.

శ్రీనీలకంఠమహాకవికృత సుభాషిత శతకత్రయమునందు
కలివిడంబనశతకము సమాప్తము.

---

శ్రీరస్తు.

సుభాషితశతకత్రయమునందు రెండవదియగు

# సభారంజనశతకము.

శ్లో. మద్దర్శనీపరిజ్ఞాన మండితైరివ పండితైః,
స్తంభై శ్చిత్రై ర్వితానై శ్చ సభా కిమవభాసతే. ౧

తా. అఖిలశాస్త్రముల నెఱింగిన పండితోత్తములచేత నలంకరింపఁబడిన సభ ప్రకాశించునటుల చిత్రవిచిత్రములగు స్తంభములు చాందినీలు మున్నగునవి మాత్రముగల సభరాణింపదు. (సభకు అలంకారము సభయందున్న పండితులుగాని చాందినీలు శిల్పనైపుణి మున్నగునవిమాత్రముగాదని భావము.)

శ్లో. సన్తి సర్వవిధా ష్షర్త్యా న సన్త్యేకే విపశ్చితః,
అనూర్యేణేవ లోకేన కిం తేన విషయేణ నః. ౨

తా. లోకమునందు సర్వవిధములయిన మనుష్యులున్నారు గాని వస్తుతత్త్వపరిజ్ఞాతలగు పండితులుమాత్రము గనంబడుటయరుదు. సూర్యుఁడులేని ప్రపంచమువలెను న్న ఆప్రదేశము నిరుపయోగము.

శ్లో. ఉద్యంతు శతమాదిత్యా ఉద్యంతు శతమిన్దవః,
స వినా విదుషాం వాక్యై ర్నశ్యత్యాభ్యంతరం తమః. ౩

తా. నూర్వురు సూర్యులుదయించెదరు గాక నూర్గురుచంద్రు లుదయింతురుగాక. విద్వాంసులయొక్క వాక్యములచేతగాని లోనిచీకటి (అజ్ఞానాంధకారము)తొలఁగజాలదు.

శ్లో. బహుధా బహుబోద్ధవ్యం బహుభోక్త్యే బహువాసరాః,
బహుకల్పశతస్థాయి లబ్ధం బహువిధం యశః. ౪

తా. లోకమునం దెవ్వఁడేని చిరకాలము నిలిచియుండుకీర్తిని సంపాదింపఁ దలచినయెడల చిరకాలమునేకులకడ శుశ్రూషాదికము సలిపి ఎంతయోనెఱింగి సంచరించవలయును.

శ్లో. పాషాణా స్సర్వపర్వైతే పద్మరాగేషు కో గుణః,
ప్రకాశః కశ్చి దత్రాఽస్తి పరత్ర స నవిద్యతే. ౫

తా లోకమునందు రాలు ఎన్నివిధముగానో నున్నవి. పద్మరాగములున్నూ వానిలో జేరినవియే. అయినప్పటికిన్నీ ఇతరములయిన వానియందు లేనిప్రకాశమను గుణవిశేషముండుటచేతనే పద్మరాగము లంతగాకొనియాడఁబడుచున్నవి. (అట్లే పండితులం పామరుల మనుష్యమాత్రులయినను జ్ఞానాధిక్యముచేత పండితు లధికులని భావము)

శ్లో. జాత్యన్ధా జాతిబధిరా జాతిమూకాశ్చ తేజనాః,
సమ్యగారాధితా యైర్న సన్తో విజ్ఞానసిన్ధవః. ౬

తా జ్ఞానసముద్రులగు పండితులనుచూచి గౌరవింపనివారలకు కన్నులుండియు వారు జాత్యంధు లనఁబడుచున్నారు. చెవులుండియు పుట్టుచెవుడు లనుచున్నారు నోరుండియు, పుట్టుమూగ లగుచున్నారు. (గౌరవార్హులగాంచి గౌరవింపనివారలకు కన్నులు, చెవులు, నోరుఉండియు వ్యర్థమనిభావము)

శ్లో. అపి మానుష్యకం లబ్ధ్వా భవన్తి జ్ఞానినో నయే,
పశుతైవ వరం తేషాం ప్రత్యవాయానివర్తనాత్. ౭

తా. ఈలోకమునందు మనుష్యజన్మమెత్తియు నెవ్వఁడు జ్ఞానసముపార్జనము చేయుటకు ప్రయత్నింపఁడో వానికంటె పశువే శ్రేష్ఠము. పశువులు పాపకృత్యముల నాచరింపవు. కావున మనుష్యునికంటె పశుత్వమే శ్రేష్ఠము. (పశ్వాదులకు కర్మాచరణమునందు పాపపుణ్యఫలములు లేవనిభావము)

శ్లో. కింపరోక్షం కిమధ్యక్షం కింలభ్యం కిన్నుదుర్లభం,
సర్వమైంద్రియికం వస్తు సర్వం కరగతం సతామ్. ౮

తా. పండితులగువారలకు ఒకవస్తువు అగోచరమనియు, ఒకటి గోచరించుననియు, యొకటి సులభమనియు, యొకటి దుర్లభమనియు, యొక్కటి ఇంద్రియగోచరమనియు లేదు. వారికి అన్నియు కరతలామలకములవలెనే తోఁచుచుండును.

శ్లో. స్థావరా జంగమా మర్త్యా బ్రాహ్మణా మునయ స్సురాః,
శివ ఇత్యన్యనిమా భేదా శ్చిదుత్కర్ష నిబన్ధనాః, ౯

తా. స్థావరములనియు, (అనగా కదలని వృక్షపర్వతాదులు) జంగమములనియు (జంగమములనఁగా కదలునట్టిప్రాణులు) మనుష్యులనియు, బ్రాహ్మణులనియు, మునీశ్వరులనియు, దేవతలనియు, శివుఁడనియు అనెడి నానావిధభేదములు జ్ఞానాతిశయము చేత క్రమముగ నేర్పడినవియే గాని వేఱుగాదు.

శ్లో. విద్యు జ్జలధరో వృష్టి శ్చంద్రార్కౌ సాగరా ఇతి,
సర్వ మద్భుత మజ్ఞానాం జానతాం తు నకించన. ౧౦

తా. మెఱుపు, మేఘము, వర్షము, చంద్రుఁడు, సూర్యుఁడు సముద్రము అనునవి అజ్ఞానులకు ఆశ్చర్యకరములు గానుండునుగాని జ్ఞానులకుమాత్రము వింతయేమియుగాదు.

శ్లో. తత్రతత్ర స్థితై ర్జ్ఞాన కరణై రివ విగ్రహాః,
విద్వద్భి శ్శోభతే దేశ స్తై ర్విహీన స్త్వమంగళః. ౧౧

తా. దేహమువందచ్చోట కన్ను, ముక్కు, చెవి, నాలుక మున్నగు జ్ఞానేంద్రియము లున్నయెడల ఆదేహము ఎటులశోభించునో అట్లే అచ్చటచ్చట పండితులుగల దేశము రాణించును. విద్వాంసులు లేనిదేశము నేత్రాది జ్ఞానేంద్రియరహితమయిన దేహమువలె ప్రకాశింపదు.

శ్లో. అమలీమస మచ్ఛిద్ర మక్రేయ మతిసున్దరమ్,
అదేయ మప్రతిగ్రాహ్యం మహో జ్ఞానం మహాధనమ్. ౧౨

తా. జ్ఞానమను మహాధనము నిర్మలమయినది, నిర్దోషమయినది, కొనుటకు శక్యముకానిది, అతిసుందరమయినది, ఇతరులకివ్వ శక్యముకానిది, ఇతరులు తీసికొనుటకు శక్యముకానిదియు నయి వెలయుచున్నది.

శ్లో. నసద్భశక్తిహీనానాం శబ్దాభ్యాసో వృథాశ్రమః,
ముగ్ధాని లబ్ధ్వా పుష్పాణి ముగ్ధితః కిం కరిష్యతి. ౧౩

తా. సమయోచితపరిజ్ఞానము లేనివార లెన్నిశాస్త్రములఁ జదివినను వృథాశ్రమయగును గాని అవంతయేని లాభములేదు. బోడివానికి సువాసనగలపూలు ఇచ్చినయెడల వాడువాని నెట్లు ధరింపఁగలఁడు.

శ్లో. శాస్త్రేష్వ దుర్గ్రహోఽప్యర్థ స్స్యన్దతే కవిసూక్తిషు,
దృశ్యం కరగతం రత్నం దారుణం ఫణిమూర్ధని. ౧౪

తా. శాస్త్రములందున్న విషయము గ్రహింపశక్యము కాకపోయినను అదే విషయము కావ్యమునందు ప్రతిపాదింపబడిన యెడల అమృతమువలె ఆస్వాద్యమయియుండును. కాలసర్పము శిరమునందున్న నాగమణి, భయంకరమయియుండును గాని చేతియందున్న రత్నము రమణీయమయియుండును గదా!

శ్లో. ఆజ్ఞస్యం వ్యవహారాణా మార్జవం పరమం ధియాన్,
స్వాతన్త్ర్య మపి తన్త్రేషు సూతే కావ్యపరిశ్రమః. ౧౫

తా. కావ్యపరిశ్రమమువలన మనుష్యునకు వ్యవహారములయందు చురుకుదన మేర్పడును. బుద్ధిసూక్ష్మత, స్వాతంత్ర్యాలోచనాశక్తి మున్నగునవి చక్కగా నలవడును.

శ్లో. సాహిత్యవిద్యాహీనానాం సర్వశాస్త్రవిదా మపి,
సమాజం పరిపశ్యన్తి సమజం బుద్ధిశాలినః. ౧౬

తా. ఇతరములగు శాస్త్రములన్నియు అభ్యసించినప్పటికిన్ని సాహిత్యశాస్త్రము చదువనివారల సమాజమును చూచి బుద్ధిమంతులు సమజముగా భావింతురు. సమాజమనగా మనుష్యసంఘము. సమజమనగా పశుసమూహము అనగా సాహిత్యశాస్త్రవిహీనులు పశువుతో సమానులు.

శ్లో. అశిక్షితానాం కావ్యేషు శాస్త్రాభ్యాసో నిరర్థకః,
కిమ స్త్యనుపనీతస్య వాజపేయాదిభిర్మఖైః. ౧౭

తా. కావ్యముల నభ్యసింపకయే శాస్త్రముల చదువుట నిరర్థకము వాజపేయ, పౌండరీకాదియాగములతో ఉపనయనము కానివానికి పని యేమియున్నది. ఉపనయనవిహీనుడు యజ్ఞాదికము నాచరించుట కెట్టుల అనర్హుడో కావ్యాధ్యయనము చేయనివాడు శాస్త్రాధ్యయనమున కట్లే యనర్హుడని భావము.

శ్లో. అన్ధా విద్వజ్జనైర్హీనా మూకా కవిభి రుజ్ఝితా,
బధిరా గాయకైర్హీనా సభా భవతి భూభృతాన్. ౧౮

తా. విద్వాంసులులేని రాజసభ గ్రుడ్డిది కవులులేని రాజసభ మూగవాండ్ర సభ. గాయకులులేని రాజసభ చెవిటివాండ్ర సభ.

శ్లో. సాహిత్యా దపి శాస్త్రాణి విశిష్టానీతి చే స్మృతిః,
తతోఽపి వేదాధ్యయనం తతోఽపి శివకీర్తనమ్ ౧౯

తా. సాహిత్యపరిజ్ఞానముకంటె శాస్త్రాభ్యాసము యెక్కువ గావున సాహిత్యపరిశ్రమలేక శాస్త్రములుచదువుట నిష్ప్రయోజనమని చెప్పుట తగదు అని చెప్పెదరేని

కావ్యములకంటె శాస్త్రములు గొప్పవే. శాస్త్రములకంటె వేదాధ్యయనము గొప్పది. ఆవేదాధ్యయనముకంటె శివనామసంకీర్తనము గొప్పది.

కవీశ్వరులు.

శ్లో. సంత్యశ్వా స్సన్తు మాతఙ్గా స్సన్తు యోధా స్సహస్రశః,
నరేంద్రాణాం విశేషేణ న వినా కవినా యశః. ౨౦

తా. రాజులకు వేలకొలది గుఱ్ఱములుండనిమ్ము, వేలకొలది ఏనుగులుండనిమ్ము, వేలకొలది యోధులుండనిమ్ము, వారెందఱున్నను కవియగువాఁడున్న గాని వానికి కీర్తి కలుగఁజాలదు.

శ్లో. కాణాః కమలపత్రాక్షాః కదర్యాః కల్పశాఖినః,
కాతరా విక్రమాదిత్యాః కవిదృగ్గోచరం గతాః. ౨౧

తా. కవీశ్వరునిదృష్టికి తగిలినవారలలో ఒంటికంటివారలున్నయెడల వారు పద్మపత్రవిశాలాక్షులనియు, అతిలోభులు కల్పవృక్షములనియు, పిరికిపందలు విక్రమాదిత్యులుగను లోకమునందు ఖ్యాతిని గాంచెదరు.

శ్లో. పరదేశ్యం వృథాదాస్యం షణ్ణ్నా మేకదారతా,
పాణ్డవానా మభూ త్కీర్త్యై పారాశర్యకవే ర్గిరా. ౨౨

తా. పాండవులయంగుగల ఒకచోట నిలుకడలేక పరదేశమునందు వాసము, ఒకరికి ఊడిగముచేయుట, ఒకస్త్రీకి ఐదుగురు భర్తలుండుట యనునవి సర్వసాధారణముగ నింద్యములేయైనను వ్యాసభగవానుని యనుగ్రహముచేత అపకీర్తికరములు కాకపోవుటయేగాక కీర్తికి కారణభూతములాయెను.

శ్లో. జానాతే యన్న చంద్రార్కౌ జానతే యన్న యోగినః,
జానీతే యన్న భర్గోఽపి తజ్జానాతి కవి స్స్వయమ్. ౨౩

తా. సూర్యచంద్రాదులు దేనిని ఎఱుంగజాలరో, సమాధినిష్ఠాగరిష్ఠులగు యోగీశ్వరులు దేనినెఱుంగజాలరో, దేనిని సర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁడుకూడ నెఱుంగజాలఁడో అట్టిదానిని కవీశ్వరుఁడెఱుంగును.

శ్లో. సర్వాసా మపి విద్యానాం సాహిత్యం హి కవేః పదమ్,
సాధారణ్యేఽపి యత్రైవ సారస్వతపదం ధ్రువమ్. ౨౪

తా. కవీశ్వరునకు పదునాలుగు విద్యలకంటెను, చతుష్షష్టికళలకంటెను అత్యావశ్యకమయినది సాహిత్యశాస్త్రాధ్యయనము గాని ఇతరముగాదు. సారస్వతమనుపదము సర్వవిద్యలను తెలిపెడి సాధారణపదమేయైనను ముఖ్యముగా సాహిత్యమునందే రూఢిగా వ్యవహరింపఁబడుచున్నది.

శ్లో. నామరూపాత్మకం విశ్వం దృశ్యతే యదిదం ద్విధా,
తత్రాద్యస్య కవి ర్వేధా ద్వితీయస్య చతుర్ముఖః. ౨౫

తా. మనకు గనంబడుచున్న ప్రపంచమంతయు నామరూపాత్మకముగ ద్వివిధముగనున్నది. ఆనామరూపాత్మక ప్రపంచమునందు మొదటిదగు నామప్రపంచమునకు సృష్టికర్తకవి; రూపాత్మక ప్రపంచమునకు సృష్టికర్త చతుర్ముఖబ్రహ్మ.

మంచిమాట.

శ్లో. నాదాతవ్యం న దాతవ్యం న కర్తవ్యంచ కించన,
సాన్త్వ మేకం ప్రయోక్తవ్యం సర్వం తస్య వశే జగత్. ౨౬

తా. ఒకరికేమియు నివ్వనక్కరలేదు. ఒకరినుండి ఏమియు పరిగ్రహింప నక్కరలేదు. మఱేమియు చేయనక్కరలేదు. మంచిమాటలుమాత్రము అందఱితో మాట్లాడుచున్న చాలును. వారికి లోకులందఱు వశులయియుందురు.

శ్లో. అగ్నిష్టోమే కి? ముక్థ్యేకిం? కిమాజ్యే? కింరథంతరే?
స్తుతిరిత్యేవ హృష్యంతి సర్వజ్ఞా అపి దేవతాః. ౨౭

తా. అగ్నిష్టోమమునందేమున్నది? ఉక్థ్యమునందేమున్నది? ఆజ్యశస్త్రమునందేమున్నది? రథంతరసామమునం దేమున్నది? తమ్మును కొనియాడుచున్నారనియే దేవతలు సంతసించుచున్నారు. సర్వజ్ఞులయిన దేవతలే స్తుతిప్రియులయియుండఁగా కించిద్జ్ఞులయిన మనుష్యులవిషయమయి చెప్పవలసిన పనియేమున్నది.

శ్లో. న జాతిరూపకర్మాణి దృశ్యంతే మృదుభాషిణః,
పక్షిణో మలినా స్తత్ర పరపుష్టా నిదర్శనమ్. ౨౮

తా. మృదువుగ సంభాషించువానివిషయమై జనులు వానిజాతి, రూప, క్రియలను పాటింపకయే సంతోషింతురు. ఇందుకు నల్లనికోవెలపక్షియే దృష్టాంతము. (అనఁగా కోవెల పక్షియైనను నల్లగానున్నను మధురముగా పలుకుటచేత దానియందందఱు ప్రీతి కలిగియుందురని భావము)

శ్లో. అర్థహీనోఽపి మధుర శ్శబ్దో లోకప్రియఙ్కరః,
వీణావేణుమృదఙ్గాదీ న్యత్రోదాహరణాని నః. ౨౯

తా. అర్థహీనమయినను చెవులకింపుగాపలికినమాట లోకులకు ప్రీతిపాత్రమగును. వీణ, పిల్లనగ్రోవి, మద్దెల మున్నగు వానిధ్వని అర్థహీనమయినను మనము ప్రేమించుటకు మాధుర్యమేగదా కారణము.

శ్లో. జిఘాంసంతోఽపి పశవో రుదన్తోఽపి స్తనంధయాః,
ఘ్నన్తోఽపి రిపవో యుద్ధే వశ మాయాన్తి సాంత్వతః. ౩౦

తా. సాంత్వమువలన (సాంత్వమనఁగా మంచిమాటవలన) అందఱు లోఁబడు చున్నారు. పొడిచి చంపెడి పోట్లపఠుపులును, ఏడ్చి పోరుపెట్టెడి పసిబిడ్డలును, రణ రంగమునందు కత్తిదూసి పైఁబడి చంపఁదలఁపడిన శత్రువులును, సాంత్వవచనములవలన లోఁబడిపోవుచున్నారు

## దాతృత్వము.

శ్లో. దాతుః ప్రతిగ్రహీతుశ్చ యథాహస్తౌ వ్యుత్తరాధరౌ,
తయో రప్యుత్తరాధర్యం తాభ్యామేవోపపద్యతే. ౩౧

తా. దాతయొక్కయు, ప్రతిగ్రహీతయొక్కయు పైన క్రిందగల హస్తములే వారియొక్క ఎక్కుపతక్కువలను వెల్లడించుచుండును. (అనఁగా ఇచ్చువానిచేయి పైన నుండును కనుక వాఁడు గొప్పవాఁడనియు, పుచ్చుకొనువానిచెయ్యి క్రిందనుండును కనుక వాఁడు క్రిందివాఁడనియు భావము )

శ్లో. అమర్త్యా స్సంతు మర్త్యావా చేతనా స్సన్త్వచేతనాః,
దానమేవ పురస్కృత్య స్తూయన్తే భువనైస్త్రిభిః. ౩౨

తా. మనుష్యులుగానీ, దేవతలుగానీ, చేతనములుగానీ, అచేతనములుగానీ, దాన ము ననుసరించియే ముల్లోకములవారిచేత కొనియాడఁబడుచున్నారు.

శ్లో. దేయం ద్రవ్య మియత్తావా దానోత్కర్షే న కారణమ్,
కిం త్వవచ్ఛేదరాహిత్యం ధనదామ్బుదయో రివ. ౩౩

తా. ఇచ్చునట్టిద్రవ్యముగాని మితముగాని దానముయొక్కయాధిక్యమునకు కార ణముగాదు. ఇఁకనేమనఁగా కుబేరుఁడు మేఘమునకువలె అవచ్ఛేదరహితముగ నుండ వలయును.

శ్లో. దదాతి రాదదాతిశ్చ ద్వావేతౌ పరమాద్భుతౌ,
యయో స్స్వామ్యంచ దాస్యంచ లీలామాత్రవిజృంభితమ్. ౩౪

తా. ఇచ్చుట, పుచ్చుకొనుట యనునవి రెండును మిక్కిలి యాశ్చర్యమును కలిగించునవియై యున్నవి ప్రభుత్వము, దాస్యత్వము అనునవి రెండున్నూ వానియొ క్క లీలలయి వెలయుచున్నవి.

శ్లో. దోషా అపి గుణాయంతే దాతారం సముపాశ్రితాః,
కాళిమానం కిలాలమ్బ్య కాళమేఘ ఇతిస్తుతిః. ౩౫

తా. దాతయగువానియందు కొన్నిదోషములున్నను అవియు సుగుణములుగానే లోకులచేత కొనియాడఁబడుచుండును. వర్షించు మేఘము బొగ్గువలె నల్లగానున్నను "నీలమేఘము, నీలమేఘము" అని అందఱు కొనియాడుచున్నారుగదా.

శ్లో. కిం దాతు రఖిలై ర్దోషైః కిం లుబ్ధస్యాఖిలై ర్గుణైః,
నలోభా దధికో దోషో నదానా దధికో గుణః. ౩౬

తా. దాతయగు వానియం దెన్నిదోషములున్న నేమి? (అనఁగా దుర్గుణములున్న ను వాని నెవ్వరు చెప్పుకొనరు) లోభియం దెన్ని సుగుణములున్న నేమి? (అనఁగా లోభి యగువానియందు సుగుణములున్నను వాని నెవ్వరుకొనియాడరు.) లోభిత్వముకంటె మిన్నయగు దుర్గుణములేదు. దాతృత్వముకంటె మిన్నయగు సుగుణములేదు.

శ్లో. అర్థా స్సాధారణా ఏవ వియుజ్యన్తే స్వభావతః,
మమతాం త్యజతాం తేషు మహా దుత్పద్యతే యశః. ౩౭

తా. లోకమునందు సంపదలు స్వభావముగ కొంతకాలము ఒకచోటనుండి తరువాత ఇంకొకచోటికి పోవుచుండును. వానియందు మమత్వమును వదలినయెడల గొప్ప కీర్తిమాత్రము కలుగును

శ్లో. మృతోఽప్యర్థం న మోక్ష్యామి బద్ధ్వా నేష్యామి మూర్ధని,
ఇతిచేత్తున్నదృఢో లోభః పాత్రే దేయ మశఙ్కితమ్. ౩౮

తా. నేనుచచ్చినను నాడబ్బును విడిచిపెట్టను. చచ్చిపోవునప్పుడు నెత్తినగట్టుకొనిపోయెదను అని ఎవ్వనికి ధనమునం దత్యాశయుండునో అట్టివాఁడు సంశయింపక సత్పాత్రమునందు దానముచేయవలయును. (సత్పాత్రమునందు ఇచ్చినద్రవ్యమే యింకొకజన్మమునందు తనకువచ్చుననిభావము )

శ్లో. వృష్టి ర్దేశాన్తరే లభ్యా శతం దత్వాఽత్ర నైగమే,
పాత్రే త్వేక మిహోత్సృజ్య పరత్రానన్త మాప్యతామ్. ౩౯

తా. (లోభియగువాఁడు వడ్డికిఆశపడి వ్యాపారస్థునకు ధనమొసంగినవాఁడు దేశాంతరమునకుఁబోయి వ్యాపారమొనర్చి కష్టపడినాననిచెప్పి అసలుకూడ ఎగవేయును.లేదా అరకొరగా) ఆరువదిరూపాయీలిచ్చిన ఇచ్చును కాని సత్పాత్రునకిచట ఒకటియిచ్చిన మఱొకజన్మమునందు మితిలేనిద్రవ్యమును పొందవచ్చును. (లోభియగువాఁడు వడ్డికి ఆశపడి కూడబెట్టిన ధనమంతయు వారివారికియిచ్చి వారు ఎగవేసినప్పుడు కడుపుపగులునటుల ఏడ్చుటకంటె సత్పాత్రదానమొనర్చిన యెడల వానికి మరుజన్మమునం దనంతమయినసంపద లభించుననిభావము.)

శ్లో. కోదత్తే క ఇవాదత్తే స్వాదృష్టం స్వేన భుజ్యతే,
ధీభేదమాత్రే దాతృత్వే క్లిశ్యన్తే కృపణాః కియత్. ౪౦

తా. ఇచ్చువాఁడెవ్వఁడు? పుచ్చుకొనువాఁడెవ్వఁడు? వానివాని యదృష్టానుసారము వాఁడువాఁడు అనుభవించుచున్నాడు. దాతృత్వమనునది బుద్ధిభేదముమాత్రమే ఇందులకుగాను లుబ్ధులెంతో దుఃఖింతురు.

శ్లో. స్వాతన్త్ర్యం యది చోరేఽపి భోక్తృత్వం యది బన్ధుషు,
నిష్కారేతు భ్రమ నాన్యమ్యం త్యక్త్వా లభ్యతాం యశః. ४१

తా. 'ధనము తనదే'యనితలంచుట భ్రమగాని యథార్థముమాత్రముకాదు. ధనమునకు తానే యజమానుఁడనుకెడల దొంగలెట్లుతీసికొనుచున్నారు? చుట్టుపక్కము లెట్లుతినిపోవుచున్నారు? కనుక ధనమునందు మమత్వబుద్ధినివదలి కీర్తినిపొందవలయును.

## ధైర్యము.

శ్లో. నధైర్యేణ వినా లక్ష్మీ ర్న శౌర్యేణ వినా జయః,
న జ్ఞానేన వినా మోక్షో న దానేన వినా యశః. ४२

తా. ధైర్యములేనిది సంపదలభింపదు, శౌర్యములేనిది జయము లభింపదు, జ్ఞానములేనిది మోక్షముకలుగదు. దానమివ్వక కీర్తికాదు.

## బలము.

శ్లో. స్వకీయాన్ భుఞ్జతే మత్స్యా స్స్వాపత్యాని ఫణాధరాః,
బలాబలవ్యవస్థేయం బలిన స్త్వకుతోభయాః. ४३

తా. చేపలు చేపలను తినుచున్నవి. పాములు తమబిడ్డలను మ్రింగుచున్నవి. బలహీనులను బలవంతులు మ్రింగివేయుట లోకమునందు సాధారణముగనున్నటుల తోఁచుచున్నది. బలవంతుల కెట్టిభయమున్నూలేదు.

శ్లో. గురుం హత్వా దివం యాతి తృణం ఛిత్వా పతత్యధః,
బలినాం దుర్బలానాం చ శ్రుతయోఽపి ద్విధా స్థితాః. ४४

తా. గురువునుచంపినవారలు స్వర్గమునుపొందిరి. గడ్డిపోచనుపీకిన నరకమును పొందుచున్నారు. వేదశాస్త్రములుకూడ బలవంతులకనియు, బలహీనులకనియు రెండుగా చెప్పుచున్నవి.

శ్లో. బలినో బలిని స్నిహ్యం త్యబలంతు నిగృహ్ణతే,
దానం దీపయతే చణ్డో దీపం వ్యాహన్తి మారుతః. ४५

తా. బలవంతులు బలవంతులఁజూచి ప్రేమించుదురు. బలహీనులఁగాంచిన అణఁగద్రొక్కెదరు. గాలి బలవంతమయిన దావాగ్నిని మఱింతవృద్ధిచేయును. బలహీనమయిన దీపమును ఆర్పుచున్నది గదా,

శ్లో. బాధకా అపి లోకానాం బలినో బిభ్యతి స్వయం,
సర్వం బలవతాం పథ్యం భిషగ్భి రభిధీయతే. ४६

తా. సామాన్యముగా వైద్యశాస్త్రమునందు బాధకములని అనఁగా జబ్బుచేయునవియని చెప్పఁబడినపదార్థములుకూడ బలవంతులనుచూచి యవి స్వయముగ భయం

పడుచున్నవి. అందువలననే బలవంతులకు అన్నియు పథ్యములే యని వైద్యశ్రేష్ఠులు వక్కాణించియున్నారు.

శ్లో. శుభప్రారబ్ధలబ్ధాఽపి లక్ష్మీ శ్శౌర్యవివర్జితా,
శోకేన దహ్యమానాఽఽస్తే షణ్ఢే కులవధూ రివ. ౪౭

తా. జన్మాంతర కృతపుణ్యవిశేషమువలన నీజన్మమున సంపదలభించినను శౌర్యములేనియెడల శోభింపఁజాలదు. నపుంసకుని ఇల్లాలు శోకసంతప్తమానసయైయుండునటుల శౌర్యహీనుని సంపదయు రాణింపదు.

శ్లో. సర్వత్ర లాల్యతే శూరో భీరు స్సర్వత్ర హన్యతే,
పచ్యంతే కేవలా మేషాః పూజ్యంతే యుద్ధదుర్మదాః. ౪౮

తా. శూరుఁడు అందఱిచేత కొనియాడఁబడును. భయశీలుని అందఱు చంపవత్తురు. మదించిన పొట్టేళ్ళకు మంచితిండిపెట్టి ఆడించుచుందురు. సామాన్యపు మేకలను కోసితిందురు.

శ్లో. భార్యాయా స్సున్దర స్స్నిగ్ధో వేశ్యాయా స్సున్దరో ధనీ,
శ్రీదేవ్యా స్సున్దర శ్శూరో భారత్యా స్సున్దర స్సుధీః. ౪౯

తా. భార్యకు సుందరమయినవాఁడు ప్రేమగలవాఁడు, భోగముదానికి సుందరమయినవాఁడు ధనవంతుఁడు, శ్రీదేవికి సుందరుఁడు శూరుఁడు. సరస్వతికి సుందరుఁడు బుద్ధిమంతుఁడు.

శ్లో. నశౌర్యం శౌర్య మిత్యేవ స్తూయతే బుద్ధిశాలిభిః,
కింతు నీత్యా సమాశ్లిష్టం వాగ్మిత్వ మిన మేధయా. ౫౦

తా శాస్త్రజన్యజ్ఞానము, సమయోచిత పరిజ్ఞానముగల వక్తృత్వమెటుల పండితులచేత కొనియాడఁబడుచుండునో అట్లే నీతిసమన్వితమగు శౌర్యము పండితులచేత కొనియాడఁబడును.

శ్లో. శౌర్యేణ లోకసేవ్యత్వం శౌర్యేణ క్షితిపాలతా,
శౌర్యేణ లభ్య స్స్వర్గోఽపి శౌర్యం కస్య న సాధనమ్. ౫౧

తా. శౌర్యముచేత సకలజనులచేత పూజింపఁబడును. శౌర్యముచేత రాజ్యము లభించును శౌర్యముచేత స్వర్గములభించును. శౌర్యముచేత సాధ్యముకానిది ఏమియున్నది? అన్నియు శౌర్యముచేత లభించుననిభావము.

శ్లో. సమరేషు నరేంద్రాణాం సవనేషు ద్విజన్మనామ్,
ప్రతికర్మసు నారీణాం శౌర్యం భవతి భూషణమ్. ౫౨

తా. రాజులు యుద్ధరంగములందు తమశౌర్యమును చూపింపవలయును. బ్రాహ్మ

ణులు యజ్ఞాది సత్కార్యాచరణమునందు తమశౌర్యమును వెల్లడించవలయును. స్త్రీలు అలంకార పరిష్కరణమునందు తమనేర్పును కనఁబరచవలయును.

శ్లో. శౌర్యే తుల్యే కథం నృత్తం స్వామీ దాస ఇతి ద్విధా,
అన్వయవ్యతిరేకాభ్యాం నీతి రిత్యవధార్యతే. ౫౩

తా. శౌర్యము సమానమయినయెడల స్వామియనియు, దాసుఁడనియు, రెండు ఎటులనేర్పడినవి. అనఁగా అన్వయవ్యతిరేకములచేత స్వామిత్వము దాసత్వము అనునవి యేర్పడినవి (అనఁగా అన్వయమనఁగా శౌర్యమున్నయెడల స్వామిత్వమనియు, వ్యతిరేకమనఁగా శౌర్యము లేకపోయినయెడల దాసత్వమనియు భావము)

శ్లో. న జయాయ స్వత శ్శౌర్యం కింతు నీత్యోపబృంహితమ్,
ప్రయుక్తం హి జయత్యస్త్రం ప్రయోక్త్రా న స్వతః క్వచిత్. ౫౪

తా. శౌర్యము స్వయముగా జయింపఁజాలదు. నానాటికి వృద్ధిచెందిన శౌర్యముచేతనే జయములభించును. శూరునిచేత ప్రయోగింపఁబడిన అస్త్రము శత్రువును సంహరించునుగాని శస్త్రమే స్వయముగాఁబోయి ఎవ్వనిని సంహరింపఁజాలదుగదా.

శ్లో. ఇద మేన పరం శౌర్య ముపాయై స్త్రిభి రన్వితమ్,
ఇదమేవ పరం మౌర్ఖ్య ముపాయై స్త్రిభి రుజ్ఝితమ్. ౫౫

తా. సామ, దాన, భేదములను మూడు ఉపాయములచేతఁ గూడినశౌర్యము గొప్పశౌర్యమగును. సామదానభేదోపాయరహితమయిన శౌర్యము మౌర్ఖ్యమగును.

శ్లో. పరాక్రమంతే యుద్ధేషు సమ మేవోభయే భటాః,
విజయన్తే హ్యుపాయజ్ఞా విజీయన్తే తదుజ్ఝితాః. ౫౬

తా. యుద్ధరంగమునందు ఇరుపక్షములవారు సమముగ పరాక్రమము గనంబఱచుచున్నను సామాది ఉపాయజ్ఞులు జయించుచున్నారు సామాద్యుపాయవిహీనులు అపజయమునందుచున్నారు.

శ్లో. కిం శాస్త్రై ర్బహుధా ఽభ్యస్తైః? కించాతుర్యేణ? కింధియా?
కిం శౌర్యేణానివార్యేణ? లలాటే చేన్న లిఖ్యతే. ౫౭

తా. నొసట బ్రహ్మవ్రాత వ్రాయనియెడల ఎన్నిశాస్త్రములు చదివినా ప్రయోజనమేమి? ఎంతచాతుర్యమున్న నేమిలాభము? ఎంతబుద్ధియున్న ఉపయోగమేమి? నిరాటంకమయిన పరాక్రమముండి యేమిలాభము?

## అదృష్టము.

శ్లో. ఘటమానాః కుటుంబేషు దదతీతి విపశ్చితః,
మూఢేషు రమతే లక్ష్మీ రహో దిష్టస్య చేష్టితమ్. ౫౮

తా. విద్వాంసుల నాశ్రయించినయెడల వారలు తన్ను కుటుంబసంరక్షణార్థ ముపయోగించి అర్హులగువారలకు సద్వినియోగ మొనర్చెద రను భయముతో లక్ష్మి వారల నాశ్రయింపక మూఢుల నాశ్రయించుచున్నది. విధివైచిత్ర్యము ఆశ్చర్యముగానున్నది.

శ్లో. తుల్యం కర్షన్తి పృథివీం తుల్యం శాస్త్రాణ్యధీయతే,
ఉన్మజ్జన్తి నిమజ్జంతి దైవస్యైకస్య చేష్టయా. ౫౯

తా. భూమినిదున్ని వృత్తి వ్యవసాయము చేయువారలందఱు ఒక్కవిధముగానే పాటుపడుచున్నారు. గురువులకడ శుశ్రూషాపూర్వకముగ శాస్త్రాధ్యయనము చేయు వారలందఱు ఒకవిధముగ చదువుచున్నారు. కాని దైవవశముచేత కొందఱకుమాత్రమే మంచిపంట పండుచున్నది కొందఱకు ఎండిపోవుచున్నది. కొందఱు పండితులగుచున్నారు. కొందఱకు చదువు పట్టుటలేదు. (విద్యాసంపదలు అదృష్టాధీనములని భావము)

శ్లో. లుభ్యంతి వితరన్తోఽపి కుప్యన్తి సరళా అపి,
ముహ్యన్తి మతిమంతోఽపి భోక్తృభోగవిపర్యయాత్. ౬౦

తా. అనుభవించువానియొక్క గురదృష్టముననుసరించి దాతృత్వము గలవారలు కూడ లోభులగుచున్నారు. సత్స్వభావము గలవారలుకూడ కోపించుచున్నారు. మహా బుద్ధిమంతులు సైతము పాత్రాపాత్రత్వముల నెఱుంగఁజాలక పొరబడుచున్నారు.

శ్లో. అధీయతే విజానంతి విరజ్యంతి ముహుర్ముహుః,
నాత్యంతాయ నివర్తంతే నరా నైమస్యతో విధేః. ౬౧

తా. లోకమునందు శాస్త్రములను పఠించుచున్నారు. విషయములను తెలిసికొను చున్నారు. మాటిమాటికి వైరాగ్యము నవలంబించుచున్నారు. కాని విధివైషమ్యమువలన తీవ్రమయిన మోక్షేచ్ఛగలవార లగుటలేదు.

## కా ల ము.

శ్లో. దోహదై రాలవాలైశ్చ కియద్వృక్షా నుపాస్మహే,
తే తు కాలం ప్రతీక్షంతే ఫలపుష్పసమాగమే. ౬౨

తా. చెట్లు చక్కఁగా చిగిర్చి పుష్పించి ఫలించవలయుననుతలంపుకలిగి శ్రద్ధతో పాదులుకట్టి ఎరువువేసి నీరుపోసి యెంతో పాటుపడుచున్నను ఋతుకాలమురానిది చిగిర్చి పూచి ఫలింపఁజాలవుగదా.

శ్లో. కః ప్రసూతే పురోవాతం కః ప్రేరయతి వారిదమ్,
ప్రాప్తేతు శ్రావణే మాసి భవత్యేకార్ణవం జగత్. ౬౩

తా. శ్రావణమాసమురాగానే తూర్పుగాలి నెవ్వఁడు కలిగించుచున్నాఁడు. మేఘునివర్షింపుమని ప్రోత్సాహపఱుచు వారెవ్వరు? ప్రపంచమంతయు సముద్రమువలె అగు చున్నది గదా. (ఆయాకాలమునకు ఎట్లు జరుగవలయునో అట్లు జరిగితీరునని భావము.)

శ్లో. కాలః కరోతి కార్యాణి కాలఏవ విహంతిచ,
కరోమీతి విహన్మీతి మూర్ఖా ముహ్యంతి కేవలమ్. ౬౪

తా. కాలమే ఆయాపనులను చేయుచున్నది. కాలమే ఆయాకార్యములను చెడగొట్టుచున్నది. కాని యీవిషయము నెఱుంగక మూర్ఖుఁడు నేనే పనిచేయుచున్నాను. నేనే పనిని చెడఁగొట్టుచున్నానని అజ్ఞానముతో తలంచుచున్నాఁడు.

శ్లో. అపికాలస్య యః కాల స్సోఽపి కాలమపేక్షతే,
కర్తుం జగంతి హర్తుం వా కాల స్తేన జగత్ప్రభుః. ౬౫

తా. సకలజీవుల నాశనమొనర్చు మృత్యువునకు కాలుఁడగు ఈశానుఁడుకూడ జగన్నిర్మాణసంహారము లొనర్చుటకును కాలమును నిరీక్షించుచున్నాఁడు కావున కాలమే జగత్ప్రభువు.

శ్లో. కాల స్సదాగతి రపి స్థాయీవ పరిచేష్టతే,
చండమారుతవ ద్విశ్వ మధరోత్తరయన్ క్షణాత్. ౬౬

తా. ప్రళయకాలమునందలి మహావాయువు నిమిషములోపల ప్రపంచమును తల్లక్రిందుగా నొనర్చునటుల కాలముకూడ సదాగతి అయినను లోకములను తలక్రిందుగానొనర్చుచు చలింపనిపగిది చూపట్టుచున్నది.

శ్లో. కాల శ్చాలయతి ప్రాయః పండితా న్పామరా నపి,
తం చే చ్చికీర్షసి వశే తితిక్షైవ మహౌషధమ్. ౬౭

తా. కాలము తెలుపుగ పండితులను పామరులనుకూడ చలింపఁజేయుచున్నది. ఆకాలమును స్వాధీనపఱచుకొనుటకు ఓర్పునుమించిన సాధనము లేనేలేదు.

క్షమ.

శ్లో. రంధ్రేషు ప్రహరిష్యంతః కతికామాదయో ఽరయః,
క్షణా న్నశ్యతి లోకోఽయం క్షమాచే న్న నియచ్ఛతి. ౬౮

తా. ఓర్పనునది ఒకటియుండి నిగ్రహించుచుండుటచేత నీప్రపంచము నిలిచియున్నది గాని లేనియెడల కామక్రోధాది శత్రువు లెందఱినో గుంటలలో త్రోసియుండవచ్చును.

శ్లో. అపకారపరానా మప్యుపకుర్వంతి సాధవః,
ఛింద న్త మపి వృక్ష స్స్వం ఛాయయా కిం నరక్షతి? ౬౯

తా. సత్పురుషులు తమకపకారమొనర్చుచున్న వారికికూడ ఉపకారమునే చేయుచుందురు. చెట్టు తన్ను నఱకుచున్నవానినికూడ తననీడచేత సంరక్షించుచున్నది.

శ్లో. స్రవత్యేవ సదాజ్ఞానం స్రవత్యేవ సదా తపః,
ఛిద్రం ఛిద్ర మనుప్రాప్య నచే చ్ఛాదయతి క్షమా. ౭౦

తా. ఓర్పరునది లోపములను సవరించి ఎప్పటికప్పుడు కామక్రోధాదులను నశింపఁజేయుచుండ బట్టిగాని లేనియెడల జ్ఞానము సమూలముగ నశించును. తపము చెడిపోవును.

శ్లో. క్షమాం రక్షన్తి యే యత్నాత్ క్షమాం రక్షంతి తే చిరమ్,
క్షమాఽఽస్తే నిభృతా యేషు క్షమాస్తే సర్వకర్మసు. 20

తా. ఎవరు క్షమను (ఓర్పును) రక్షించుచున్నారో అనఁగా ఓర్పుకలిగియున్నారో వారు చాలకాలము క్షమను (భూమిని) రక్షింపసమర్థులగుదురు. ఎవరియందు ఓర్పు మిక్కుటముగనుండునో వారు సకలకార్యముల సాధింప సమర్థులగుచున్నారు.

శ్లో. మూర్ఖా శ్శమయితుం దుఃఖం సంరంభన్తే తతస్తతః,
క్షమయైవ నిగృహ్ణంతి ధీరా స్సంరంభవర్జితాః. 21

తా. మూర్ఖులు తమకు వచ్చినదుఃఖమును పోగొట్టుకొనుట కెంతయో పటాటోపము నర్పుచుందురు విద్వాంసులు సంరంభవిహీనులయి ఓర్పుచేతనే దుఃఖబాధను సహింతురు.

శాంతము.

శ్లో. ఆకాల్యా దానిశీథా చ్చ కుక్ష్యర్థం వ్యాప్రియామహే,
నచ నిర్వ్రణమో జాతు శాంతా స్తు సుఖ మాసతే. 23

తా. ఉదయము మొదలుకొని అర్ధరాత్రమువఱకు పొట్టపోసికొనుటకయి ఏమేమియో తంటాలు పడుచున్నాము కాని సుఖమునుమాత్ర మింతవఱకు పొందియుండలేదు. శాంతులయినవారలు శ్రమపడకయే సుఖించుచున్నారు.

శ్లో. నాయస్యంతి శరీరాణి న దైన్య మవబుధ్యతే,
సం భవత్యపిచానంద శ్శాన్తి మభ్యస్యతాం సతామ్. 24

తా. శాంతిగుణముగల సత్పురుషులకు శరీరము కష్టపడనక్కఱలేదు. దైన్యమనునది ఎట్టిదో వారెఱుంగరు. ఆనందమునుమాత్రము సర్వదా అనుభవింతురు.

శ్లో. ప్రసీదత్యపరిస్పంది పయఃకలుషితం యథా,
తథా శాంత మపి స్వాంతం ప్రసీదతి శనైశ్శనైః. 25

తా. కలఁకలుచేయఁబడిన నీఁటిని కదలకుండునటుల నొకచోటనుంచినయెడల నీరుతేటి ఎటులశుద్ధమగుచున్నదో అలాగుననే కామాది శత్రులదూషితమగు చిత్తమును శాంతముగనుంచిన క్రమక్రమముగ శుద్ధమగును.

శ్లో. యత్నేన మహతా లభ్యా దాసా ద్విత్రా స్సుఖాయ నః,
శాంతస్య కాలాదృష్టాద్యా శ్శతం భృత్యా అచేతనాః. 26

తా. మనము ఉపచారము నిమిత్తము ఇద్దఱుముగ్గురు నొకరులను పెట్టుకొన్నయెడల వారికొఱ కెంతో ద్రవ్యము వ్యయపఱచవలయును. శాంతముగలవారలకు కాలము అదృష్టము మున్నగు నూర్లకొలది సేవకులు జీతము బత్తెములేకయే నూడిగము నొనర్చుచు సుఖమును కలుగఁజేయుచున్నారు.

## ధర్మము.

శ్లో. అపిమృదాప్య గిరా లభ్య స్సదా జాగర్త్యతన్ద్రితః,
నాస్తి ధర్మసమో భృత్యః కించిదుక్తస్తు ధావతి. ౨౮

తా. మంచిమాటచేతఁగూడ లభించువాఁడును, ఎల్లప్పుడు మెలఁకువ గలిగియుండు వాఁడును, కునుకుపాట్లు లేనివాఁడును, చెప్పియు చెప్పకముందే శీఘ్రముగ పరుగిడి కార్యమును నెరవేర్చువాఁడును అగు ధర్మమను సేవకునితో సమానుఁడగు సేవకుఁడు మఱొక్కఁడు లేడు. ద్రవ్యము సెలవుచేసి చెప్పినమాట విననివారలును తూఁగుబోతులును అగు భృత్యుల నుంచుకొనుటకంటె ధర్మమునుంచుకొన్నయెడల సకలకార్యములు సాధ్యములగును.

శ్లో. అర్థేనోపార్జ్యతే ధర్మో ధర్మేణార్థ ఉపార్జ్యతే.
అన్యోన్యాశ్రయణం హ్యేత దుభయోత్పత్తిసాధనమ్. ౨౯

తా. ద్రవ్యముచేత ధర్మమును గడింపవచ్చును. ధర్మముచేత అర్థము పొందఁబడుచున్నది. ఈ పరస్పరసంబంధమే ధర్మార్థముల యుత్పత్తికి సాధనము.

శ్లో. విపణిః పుణ్యతీర్థాని విక్రేతార స్త్వకించనాః,
తృణేనాప్యత్ర స్తత్రై ధర్మః పర్వసు క్రీయతే మహాన్. ౩౦

తా. ధర్మమును కొనవలెనన్న పుణ్యతీర్థములే అంగడి; అధర్మము నమ్ము వారలు పేదవారలు; పర్వకాలమునందు చివరకు తృణముచేతను కూడ కొనవచ్చును. (అనఁగా ధర్మమనునది అంగడిలో దొరకు వస్తువుకాదు. పర్వకాలములందు గంగాదిపుణ్యతీర్థములకుఁబోయి శక్తికొలఁది మంచిమనస్సుతో తృణమో కణమో ఒసంగిన లభించునని భావము)

శ్లో. చుళకోదకమాత్రేణ ధాన్యముష్టిద్వయేనచ,
మరుభూమిషు దుర్భిక్షే ధర్మసస్యం మహాఫలమ్. ౩౧

తా. ధర్మమనుపంట చాల చిత్రమయినది. చేరెడునీళ్ళచేతను, పిడికెడు గింజలచేతను కూడ దుర్భిక్షమునందున్నూ ఎడారులయందున్నూ మహాఫలము నొసంగును. లోకమునందు పైరుపెఱిగి ఫలించుటకు నీరు సమృద్ధిగనుండవలయును. చేనునకు తగినంత విత్తనము లుండవలయును. భూమి సారవంతమయి యుండవలయును. తరువాత వర్షము కురియవలయును ఇన్నియున్న గాని పంటపండదు. ధర్మసస్యమన్ననో అట్లుకాదు. వానలులేక దేశ మెండఁబారియున్నను మరుభూమియందుగాని గుప్పెడుధాన్యము వేసి చేరెడునీళ్లు చిలుకరించినయెడల ధర్మసస్యము పెఱిగిఫలించును పాత్రాపాత్రములు విచారింపక గుప్పెడు ముష్టిపెట్టినను పితరులకు తర్పణాదులొనర్చినను గొప్పఫలము కలుగుచున్నది. పాత్రాపాత్రముల నెఱింగి ధర్మముచేసినచో అనంతఫలము కలుగునని వేఱుగ చెప్పనక్కరలేదని భావము)

శ్లో. ధర్మో నర్మసఖః కామే గురు స్తత్త్వోపదేశనే,
భట స్సంగరరంగేషు సచివోఽర్థసమార్జనే. ౩౧

తా. ధర్మము మనోరథములసమకూర్చుటయందు ప్రియమయినచెలికానివలె తోడ్పడును. గురువువలె జ్ఞానోపదేశమొనర్చి మోక్షము నొసంగును. యుద్ధరంగమునందు శూరుఁడగు భటునివలె జయమునుసమకూర్చును. మంత్రివలె సకలకార్యములందు తోడ్పడును.

శ్లో. భువి వృక్షా దివి చ్ఛాయా భువి కూపో జలం దివి,
భువి యద్దీయతే విప్రైర్దివి తద్దీయతే సురైః. ౮౨

తా. భూమియందు వృక్షములవేసి పోషించి లోకులకు నీడచేత సుఖమును కలుగఁజేసినయెడల వానికి స్వర్గలోకమునందు కల్పవృక్షచ్ఛాయల క్రింద విహారసౌఖ్యము లభించును. బావులు త్రవ్వించిన స్వర్గలోకమునందు మంచియుదకము లభించును భూలోకమునందు ఏవస్తువులను బ్రాహ్మణులకు దానము నొసంగుచున్నారో ఆవస్తువులను దేవతలు స్వర్గమునందు మరల వీని కొసంగుచున్నారు.

శ్లో. కదలీకందవద్ధర్మో న రోహతి బహిర్గతః,
ఛాదితస్తు ఫలం చారు సూతే పనసమూలవత్. ౮౩

తా. ధర్మము అరటిగుంపవలె బయలుపడకయున్నయెడల లోలోన పెరుగుచుండును. ధర్మమును మూసియుంచినయెడల వేరుపనసవలె ఫలముల నొసంగుచున్నది.

శ్లో. దుఃఖేనోపార్జ్యతే ధర్మస్సుఖేన తు వినశ్యతి,
కృచ్ఛ్రలబ్ధమిమం త్రాతుం నేచ్ఛంతి మునయస్సుఖమ్. ౮౪

తా. ధర్మము కష్టపడి కృచ్ఛ్రచాంద్రాయణాదికము లొనర్చినఁగాని కలుగఁజాలదు. సుఖానుభవముచేత నిముసములో నశించుచున్నది కావున కష్టపడిసంపాదించిన ధర్మమును రక్షించుకొనుటకుఁగాను ఐహికములగు తుచ్ఛసుఖములను మునీశ్వరులు కోరుట లేదు.

శ్లో. సంపాద్యతాం వా యత్నేన యద్వా విక్రీయతాం మయమ్,
సర్వదా భుజ్యతాం వాఽన్యైర్ధర్మో భవతి నాన్యథా. ౮౫

తా. ప్రయత్నపూర్వకముగ సంపాదించినను, లేక ఒకరికిఅమ్మినను, ఇతరులెల్లప్పుడు అనుభవించినను ధర్మముమాత్రము నశింపదు. (ద్రవ్యమువలె ఇతరులు హరించుటకు ధర్మము శక్యముకాదని భావము.)

అర్థము.

శ్లో. అర్థవంతః ప్రశస్యన్తే నింద్యంతే తద్వినాకృతాః,
ఆగమేష్వస్తి చేదేవ మద్భుతం కిం శరీరిషు? ౮౬

తా. శాస్త్రములయందు కూడ అర్థవంతములు ప్రశంసింపఁబడుచు అర్థవిహీనములు నిందింపఁబడుచున్నవి. ఇఁక మనుష్యులవిషయమయి చెప్పవలసినపనియేమున్నది?

శ్లో. అర్థోఽప్యర్థేన చేత్సాధ్యః కా వార్తా? ధర్మకామయోః,
అర్థస్సర్వజగన్మూలమనర్థోఽర్థవిపర్యయః. ౮౭

తా. అర్థముచేతనే అర్థముకూడ సాధ్యమని చెప్పుచుండఁగా ధర్మకామములు అర్థసాధ్యములు అని వేఱుగా చెప్పనక్కరలేదు గదా జగత్తునకు మూలమే అర్థము. అర్థములేనియెడల అంతయు అనర్థమగును.

శ్లో. కర్మజ్ఞానంచ మోక్షాయ కర్మణ్యర్థో ఽధికారితా,
అతో ఽర్థేనైవ కైవల్యం న కైవల్యేన లభ్యతే. ౮౮

తా. మోక్షమునకు పుణ్యకర్మాచరణము, జ్ఞానము అను రెండుమార్గములుగలవు. కర్మాచరణమునకు ధనము కావలయును కనుక ధనముచేత కైవల్యము నందవచ్చును. కైవల్యముచేతమాత్రము అర్థములభింపదు.

శ్లో. కథమర్థం నిషేధంతు శ్రుతయ స్స్మృతయోఽపివా,
యాసా మేకం పద మపి నచలత్యర్థతో వినా. ౮౯

తా. వేదములుగాని ధర్మశాస్త్రములుగాని అర్థమునేల నిషేధించును? ఏలయనఁగా ఆశ్రుతిస్మృతులయందుఁగల ఒకపదముకూడ అర్థములేక సాగఁజాలదుగదా.

శ్లో. లక్ష్మీశ ఇతి గోవిందో మేరుధన్వేతి శంకరః,
హిరణ్యగర్భ ఇత్యేవ బ్రహ్మాపి బహుమన్యతే. ౯౦

తా. లక్ష్మీపతియని శ్రీమహావిష్ణువున్ను, మేరుధన్వుఁడు (బంగారుపర్వతము విల్లుగాగలవాఁడు) అని పరమశివుఁడున్ను, హిరణ్యగర్భుఁడని (హిరణ్యగర్భుఁడనఁగా బంగారుపొట్టలో గలవాఁడు) బ్రహ్మదేవుఁడున్ను లోకమునందు గౌరవింపఁబడుచున్నారు.

శ్లో. ఊర్ధ్వం గచ్ఛన్తి యం త్యక్త్వా యం గృహీత్వా పతన్త్యధః,
తస్య గౌరవ మర్థస్య తావత్తై వానుమీయతే. ౯౧

తా. లోకమునందు ఏధనమునువదలిన ఊర్ధ్వలోకగతులను పొందుచున్నారో, ఏయర్థమునందు మమకారమువహించిన అధోగతి నందుచున్నారో అట్టియర్థముయొక్క గౌరవము దానిచేతనే ఊహించుకొనవచ్చును.

## గార్హస్థ్యము.

శ్లో. గృహిణా యది లభ్యేత గృహిణీ హృదయంగమా,
సంసార ఇతి కోభార స్తం సార మనుపశ్యతః. ౯౨

తా. గృహస్థాశ్రమియగు వానికి మనోహారిణియగు భార్యలభించినయెడల సంసారమునందు సారమేర్పడును కావున సంసారమనునది భారముకాజాలదు

శ్లో. అహాత్య చినుమ స్స్వర్గ మపవర్గ మపక్రమాత్,
అనుకూల్యేతు దాంపత్యే ప్రతికూలే న కించన. ౯౩

తా. భార్యాభర్తలు అనుకూల్యము కలిగి సంచరించువార లయినయెడల స్వర్గసౌ

ఖ్యమును, మోక్షసుఖమును చేర్చి సంపాదించవచ్చును. భార్యాభర్తలకు ఆనుకూల్యము లేనియెడల సుఖమేమియులేదు.

శ్లో. గృహిణీ వృత్తదోషేణ గౌతమోఽత్యన్తతాపితః,
ఆతస్థే దుఃఖవిధ్వంసం కైవల్యం పరమం మునిః. ౯౪

తా. మహర్షియగు గౌతముఁడు కూడ భార్యయగు అహల్యయొక్క దుర్నడత వలన మిక్కిలి పరితపించినవాఁడయి దుఃఖధ్వంసమే పరమమయిన మోక్షముగాని వేఱుగాదని నిర్విచారముగ నుండెను.

శ్లో. అపియత్పరమం తత్త్వ మర్ధేందుకృతశేఖరమ్,
తస్యాపి తావా నానందః కిమస్మజ్జననీం వినా. ౯౫

తా. పరమతత్త్వస్వరూపుఁడగు నీశ్వరునకు సైతము సకలలోకజననియగు నాదిశక్తిలేనియెడల అంతటి యానందము ఎట్లుకలుగును?

శ్లో. నిందంతిచ ప్రశంసన్తి నిగమా యద్గృహాశ్రమమ్,
దాంపత్యసామ్యవైషమ్య భేదా దేత ద్వ్యవస్థితమ్. ౯౬

తా. వేదములొకచోట గృహస్థాశ్రమమును నిందించుచున్నవి. ఒకచోట గృహస్థాశ్రమమును పొగడుచున్నవి ప్రాతికూల్యదాంపత్యత, ఆనుకూల్యదాంపత్యతలే ఇందులకు కారణములు. అనఁగా ప్రాతికూల్యదాంపత్యముగల గృహస్థాశ్రమము నింద్యమనియు, ఆనుకూల్యదాంపత్యముగల గార్హస్థ్యాశ్రమము స్తుత్యమనియు భావము.

శ్లో. ఇంద్రియాణ్యనుపక్లేశ్య లభ్యం శ్రేయో గృహాశ్రమే,
అత స్తుర్యాశ్రమం ప్రాహు రబాధన్యాయబాధితమ్. ౯౭

తా. గృహస్థాశ్రమమునందు కీర్తినందవలయునను తలంపుగలవారలు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను మిక్కిలి శ్రమపెట్టవలయును. కావున సన్న్యాసాశ్రమము ఎట్టిబాధయులేనిదని పెద్దలు పలికెదరు.

శ్లో. భుజ్యతే యత్సుఖం ధీరై రప్రమత్తై ర్గృహాశ్రమే,
స్వర్గ స్తస్యాంగసమ్పూర్తి రపవర్గోఽస్యనిత్యతా. ౯౮

తా. గృహస్థాశ్రమమునందు జాగరూకులయి మెలఁగినవారలకు కర్మజన్యమయిన ఆదేహముండునంతవఱకు మాత్రమే స్వర్గసుఖముండును. సన్న్యాసాశ్రమము నందినవానికి లభించు మోక్షసుఖముమాత్రము శాశ్వతమయియుండును.

శ్లో. దృష్టదోషోఽపి గార్హస్థ్యే దీర్ఘదర్శితయా స్వయమ్,
గార్హస్థ్య మేవ పరమం మేనే నైయాయికో మునిః. ౯౯

తా. గౌతమమహర్షి దూరదృష్టిగలవాఁడగుటచేత గృహస్థాశ్రమమునందుఁగల

దోషములను కొన్నింటిని తానెఱింగినవాఁడయినను బాగుగ వెనుకముందు ఆలోచించి గృహస్థాశ్రమమే ఉత్తమమయినదని తలంచెను.

రాజు.

శ్లో. ఉచ్చావచం జగద్దౌస్థ్య మేకద్దైవ నిషేధతి,
ప్రవిష్టమాత్రో నృపతిః ప్రపంచమివ న శ్రుతిః. ౧౦౦

తా. వేదము నానావిధమయిన ప్రపంచముయొక్క దౌస్థ్యమును అనఁగా ప్రపంచసత్యత్వము నెట్టుల తొలఁగించుచున్నదో అట్లే రాజుకూడ నానావిధమయిన ప్రపంచముయొక్క దుస్థితిని తొలఁగించుచున్నాఁడు.

శ్లో. నరాజానం వినా రాజ్యం బలవత్స్వపి మంత్రిషు,
ప్రాణేష్వసత్సు కిం దేహ శ్చండవాతేన ధార్యతే. ౧౦౧

తా. ప్రపంచమయిన గాలి యెంతమిక్కుటముగ వీచుచున్నను ప్రాణవాయువు లేకున్న దేహమెట్టుల నిలువదో అట్లే మంత్రులు బలవంతులగు వారలెందఱున్నను రాజు లేనిది రాజ్యము నిలువఁజాలదు.

శ్లో. మాతుః కించి త్పితుః కించి దాచార్యా త్కించి దాప్యతే,
సర్వం వినీతా చ్ఛాస్త్రేషు సర్వం రాజ్ఞస్తు లభ్యతే. ౧౦౨

తా. లోకమునందు మనుష్యులు తల్లినుండి కొంచెమును, తండ్రినుండి కొంచెమును, గురువునుండికొంచెమును గ్రహించెదరుకాని సకలశాస్త్రములనభ్యసించిన రాజుదగ్గఱనుండిమాత్రము అంతయు (అనఁగా పై ముగ్గురినుండి గ్రహించినంత) గ్రహించవచ్చును.

శ్లో. స్రవంతి సర్వమర్యాదా శ్చలితే సతిపార్థివే,
పర్వతా అపి కంపంతే ప్రసక్తే కంపనే భువః. ౧౦౩

తా. భూకంపము కలిగినప్పుడు పర్వతములు సైత మెట్టులకదలుచున్నవో అట్లే రాజుధర్మము నతిక్రమించినయెడల లోకమునందు సకలధర్మములు నశించును.

శ్లో. పత్న్యాస్య మాంగళ్యయోగేన పత్యు రాయుః ప్రవర్ధతే,
ప్రకృతీనాంతు భాగ్యేన పార్థివ స్సుఖ మశ్నుతే. ౧౦౪

తా. భార్యయొక్క మాంగళ్యసూత్రబలముచేత భర్తకు ఆయుర్వృద్ధియగునటుల పాలితులగు జనులయొక్క అదృష్టవశమువలన రాజు సుఖమునందును.

శ్లో. నిర్మితం శతకం సాగ్రం నీలకంఠేన యజ్వనా,
సభారంజన మేతేన సాధయంతు మనీషిణః. ౧౦౫

తా. నీలకంఠదీక్షితునిచేత సభారంజనమను పేరుగల యీశతకము సమగ్రముగ రచింపఁబడినది. పండితు లీశతకముచేత సభారంజనము నొనర్చెదరుగాక.

శ్రీనీలకంఠదీక్షితకృత సభారంజన శతకము, సమాప్తము.

శ్రీ రస్తు.

సుభాషితశతకత్రయమునందు మూఁడవదియగు

# వైరాగ్యశతకము.



శ్లో. అస్తే కశ్చన భిక్షు స్సజ్గ్రహ్ణాతి అవ్యయాని దశ,
నమమేత్యవ్యయయుగళం యాచామ స్తం కిము స్త్యవ్యత్. ౧

తా. ఒకానొకభిక్షుకుఁడు (అనఁగా యీశ్వరుఁడు) పదియవ్యయముల సంగ్రహించియున్నాఁడు. అట్టిభిక్షుకుని మేము మఱొక్కటియాచించినను ఇవ్వఁజాలఁడు కనుక "న మమ" అను అవ్యయద్వయమును (అనఁగా వైరాగ్యమును) మాత్ర మతనిని యాచించెదము.

శ్లో. జ్ఞానం, వైరాగ్య, మైశ్వర్యం, తప, స్సత్యం, క్షమా, ధృతిః,
స్రష్టృత్వ, మాత్మసంబోధో, హ్యధిష్ఠాతృత్వమేవచ,
అవ్యయాని దశైతాని నిత్యం తిష్ఠంతి శంకరే"

అను ప్రమాణముచేత నీశ్వరునియందు జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము, తపస్సు, సత్యము, ఓర్పు, ధైర్యము, సృష్టిశక్తి, ఆత్మజ్ఞానము, అధిష్ఠాతృత్వము అనునవి ౧౦ దియు ఎల్లప్పుడు శంకరునియందుండునని గ్రహించునది ౧౦ అవ్యయములుగలవాఁడు "న మమ" అను అవ్యయద్వయమును ఇవ్వఁగలఁడని భావము.

శ్లో. ధీసచివం ధైర్యబలం సంకల్పవిరోధి శాంతిధనమ్,
విశ్వత్రయవిషయ మిదం వైరాగ్యం నామ సామ్రాజ్యమ్. ౨

తా. వైరాగ్యమను సామ్రాజ్యమునకు స్వబుద్ధియే మంత్రి, ధైర్యమే సైన్యము, సంకల్పమే శత్రువు, శాంతియే ధనము, ముల్లోకములే జయింపఁదగినవి (అనఁగా బుద్ధిమంతుఁడు ధైర్యముగలవాఁడయి ఆశనువదలి శాంతమువహించి లోకత్రయమునందు గల విషయభోగములను తృణప్రాయముగా వదలవలయునని భావము.)

శ్లో. రాజ్ఞో బిభ్యతి లోకా రాజానః పున రితోఽపి వైరిభ్యః,
ఆబ్రహ్మాణః కృతాన్తా దకుతోభయమస్పృహో రాజ్యమ్. 3

తా. పాలితులగు ప్రజలు రాజునుఁగాంచి భయపడుదురు. రాజు శత్రువులకు భయపడును. పిపీలిక మొదలు బ్రహ్మదేవునివఱకు యమునికి భయపడుదురు. వైరాగ్యసామ్రాజ్యమున కెవ్వరివలనను భయములేదు.

శ్లో. భిక్షా ప్రదా జనన్యః పితరో గురవః కుమారకా శ్శిష్యాః,
ఏకాంతరమణహేతు శ్శాన్తి ర్దయితా విరక్తస్య. ౪

తా. వైరాగ్యముగలవానికి భిక్షపెట్టువారలే తల్లులు, గురువే తండ్రి, శిష్యులే బిడ్డలు, ఏకాంతస్థితియందు సంతోషము నొసంగుశాంతియే ప్రియురాలు.

శ్లో. కిమపి న యే చేష్టంతే కార్యప్రతికార్యయో ర్విరహాత్,
 స న్త స్త ఏవ ముక్తా స్సన్దేహే గౌతమ స్సాక్షీ. ౫

తా. ఈకార్యము అనుకూలమయ్యెనని సుఖము, ఈకార్యము ప్రతికూలమయ్యెనని దుఃఖము లేకపోవుటచేత ఎవ్వరు సుఖదుఃఖవిహీనులయి చరించుచుందురో అట్టి సత్పురుషులే ముక్తులు. ఈవిషయమయి సందేహమున్నయెడల గౌతముని అడుగుడు ("దుఃఖధ్వంసమే మోక్షము" అని గౌతమునిమతము కావున అట్టిదుఃఖము లేనివారలే ముక్తులనిభావము)

శ్లో. పతతు నభ స్స్ఫుటతు మహీ చలన్తు గిరయో మిళన్తు వారిధయః,
 అధరోత్తర మస్తు జగ త్కా హాని ర్వీతరాగస్య? ౬

తా. ఆకాశమువిఱిగి భూమిమీదపడుఁగాక. భూమి బ్రద్దలగుఁగాక. పర్వతములు గిరగిరతిరుగుఁగాక. సముద్రములన్నియు నేకమగుఁగాక. జగములన్నియు తలక్రిందులుకానిండు. వైరాగ్యవంతునకు ఏమియు హానిలేదు.

శ్లో. కే చోరాః కే పిశునాః కే రిపవః కేచ దాయాదాః,
 జగ దఖిలం తస్య వశే యస్య వశే హన్త మిదం చేతః. ౭

తా. ఎవనికి చంచలమయినమనస్సు స్వాధీనమయియున్నదో వానికి లోకమునందు దొంగలెవ్వరు? కొండెగాండెవరు? శత్రువులెవ్వరు? దాయాదులెవ్వరు? లోకమంతయు వానికి వశమయియుండును.

## శాంతము.

శ్లో. విషయా ఉపతిష్ఠంతాం విషయై ర్వా సమవయంతు కరణాని,
 అంతర మేకం కరణం శాన్తం యది కా తత శ్చిన్తా? ౮

తా. లోకమునందుఁగల భోగ్యవస్తువులన్నియు ఎదుటనుండుఁగాక. నేత్రాదీంద్రియములు ఆభోగ్యవస్తువులతో సంబంధపడుఁగాక. అంతరింద్రియమగు మనస్సొకటి శాంతమయియున్నయెడల చింత యేమియులేదు. (మనోనిగ్రహము వైరాగ్యముగలవానిని విషయము లేమియుఁజేయఁజాలవని భావము.)

శ్లో. కింవిషయా న్పరిహర్తుం వస్తవ్యం మేరుకన్దరేష్వన్ధైః,
 నహ్యాద్భిరనాసక్తుం పాంసుషు రోహన్తి సద్మాని. ౯

తా. కొందఱు మూర్ఖులు విషయభోగపరిత్యాగార్థము మేరువు మున్నగుపర్వతములయొక్క గుహలనుఁగూర్చి పోవుచున్నారుకాని అయ్యది అనావశ్యకము. నీరు తగు

అకయుండవలయు ననుతలంపుతో పద్మములను దుమ్మునందు నాటుటలేదు. (తామర నీటియందున్నను నీటిసంబంధము నంటకయున్నటుల విషయములందున్నను మనస్సు నిశ్చలముగ నుంచుకొన్నయెడల జలము తామరపాకు నంటనటుల విషయములు మనస్సును భాధింపవనిభావము.)

శ్లో. అజ్ఞాన మిహా నిదానం ప్రాగ్రూపం జనన మేవ భవరోగే,
పరిపాక స్సంసరణం భైషజ్యం నైష్ఠికీ శాన్తిః. ౧౦

తా. (రోగమువచ్చినప్పుడు ఆరోగము వచ్చుటకు కారణము, దాని మొదటిరూపము. పరిపాకము నెఱింగి ఔషధమొసంగిన గుణమగును. కనుక అట్లే ఇచ్చట) జన్మమను రోగమునకు కారణము అజ్ఞానము, పుట్టుకయే ప్రాగ్రూపము, సంసారసాగరమున నీదుచుండుటయే పరిపాకము, శాంతినిష్ఠయే యీరోగమునశించుటకు ఔషధము. (కర్మపరిపాకసమయమునందుఁగాని, విషయవైరాగ్యరూపమగు శాంతినిష్ఠకలుగదని భావము)

శ్లో. స్వేనోపభుక్త మర్థం సూకరజాతిస్మరో మనుష్య ఇవ,
దూరే జుగుప్సమానో ధీరో వైరాగ్య మాద్రియతే. ౧౧

తా. తాను పూర్వజన్మమునందు పందిగాపుట్టిన మనుష్యుఁడు పూర్వజన్మస్మృతి గలవాఁడయి తాను గడచినజన్మమునందు అనుభవించినవస్తువును తలంచుకొని ఎటుల ఏవగించుకొనునో అట్లే బ్రహ్మజ్ఞానియగువాఁడు విషయభోగములఁగాంచి రోతచెంది వైరాగ్యముగలవాఁడగును.

శ్లో. శైశవ మివ కౌమారే తత్తరుణిమ్నీవ స ఇవ వృద్ధత్వే,
నస్వదతే ధీరాణా కామస్య విచేష్టితం శాన్తౌ. ౧౨

తా. చిన్నతనమునందు చేసినపనులు కౌమారదశ వచ్చినప్పుడు మనస్సునకు సరిపడనిరీతిగను, కౌమారదశయందు సలిపినపనులు యౌవనకాలమందు రుచింపనిరీతిగను, యౌవనకాలమునం దొనర్చినకార్యములు ముసలితనమునందు రుచింపనివిధముగను జ్ఞానులకు వైరాగ్యసమయమునందు కామవికారము రుచింపదు.

శ్లో. శతశః పరీక్ష్య విషయాన్ సద్యో జహాతి క్వచిత్ క్వచిద్ధన్యాః,
కాకా ఇవ వాన్తాశన మన్యే తా నేవ సేవన్తే. ౧౩

తా. నూటికి వెయ్యింటికి యొక్కఁడనో ఒక్కచోట ధన్యులయినమహాత్ములు విషయాభిలాష తుచ్ఛమయినదని ఎఱింగి దానినివదలుచున్నారు. అజ్ఞానులు కక్కినకూటినే కాకి మఱలతినునటుల విషయముల అసారత్వము నెఱింగియు మఱలమఱల వానినే అనుభవింప ప్రయత్నించుచుందురు

శ్లో. చరమా మాతాపితరౌ చరమా గృహిణీ సుతాశ్చ వై చరమాః,
కర్తవ్యే ఽతిప్రేమణి కథ మిహా ధీరా విరజ్యన్తే. ౧౪

తా. లోకమునందు కడగొట్టుభార్యయందున్నూ కడగొట్టుబిడ్డలయందున్నూ ప్రీతివిశేషముగనుండుట సర్వజనసాధారణము. కావున వైరాగ్యముకలిగి జన్మరాహిత్యస్థితి నభిలషించిన) జ్ఞానియగువానికి ఈజన్మమునందలి తల్లితండ్రులు, భార్య, బిడ్డలు మున్నగువారందఱు కడగొట్టువారలు అగుచున్నారు. ఇట్టి కడగొట్టువారియందు ప్రీతి యధికముగనుండవలసినను జ్ఞానులుమాత్రము వీరియందుగూడ ప్రేమనువిడిచి వైరాగ్యము నవలంబించుచున్నారు.

శ్లో. తృణవ ద్భ్రమ న్తి చపలా స్త్రీనామని చణ్డమారుతే చలితే,
ధరధణిరా ఇవ నంత స్తత్ర న కించి త్ప్రకమ్ప న్తే. ౧౫

తా. స్త్రీయను ప్రళయవాయువు వీచినంతమాత్రమున విషయాభిలాషగలపామరులు గడ్డిపోచలాగున అల్లాడిపోవుచున్నారు జితేంద్రియులగుజ్ఞానులు సుందరాంగనల విలాసములగాంచిన పర్వతములవలె చలింపకయుందురు (స్త్రీలవిలాసములఁ గాంచి విషయాభిలాషగలవారలు భ్రష్టులగుదురనియు, జితేంద్రియులగు జ్ఞానులు చలింపరనియు భావము)

శ్లో. కామిజనపరమభోగేనీ కామసుఖే ధారయంతి బీభత్సమ్,
సంత శ్శమసుఖరసికా స్సుధాశనా స్సూకరాన్న ఇవ. ౧౬

తా. బ్రహ్మానంద సుఖానుభవ మెఱింగినజ్ఞానులు విషయాభిలాషగల కాముకజనముచేత అనుభవింపఁబడుచున్న కామసుఖమునుఁగాంచి అమృతాహారులగు దేవతలు సూకరాన్నమును (అనఁగా పంది భక్షించెడి అమేధ్యమును) ఏవగించుకొనురీతిగ ఏవగించుకొందురు.

శ్లో. విక్షేపమాత్రభాజో వికాసకాష్ఠాగతజ్ఞానాః,
స్వస్యాపిచేష్టితాని స్వీయ మీక్షంతే పరస్యేవ. ౧౭

తా. పరిపూర్ణమయిన జ్ఞానవికాసముఁగల బ్రహ్మజ్ఞానులు లోకవ్యవహారమునందున్నవారివలె గనంబడుచుందురు కాని వారు పరులసుఖదుఃఖములను ఇతరులు చూచుచున్నను తమవిగాభావించి సుఖదుఃఖములను పొందనివిధముగా స్వకీయకార్యములను ప్రియాప్రియరహితులయి చూచుచుందురు.

శ్లో. అస్థానేఽభినివిష్టా న్స్వార్థా నస్థాన ఏవ సన్తుష్టాన్,
అనువర్తంతే ధీరాః పితర ఇవ క్రీడతో బాలాన్. ౧౮

తా. ఆడుకొనెడిబాలకులు మన్ను, కొయ్య మున్నగువానితో నొనర్చినగుఱ్ఱము మున్నగుబొమ్మలచూచి వానిని గుఱ్ఱములు, ఏనుఁగులని తలంతురు. వానినిచూచి అవి పఱుగెత్తుచున్నవని సంతసింతురు అంతటితో నూరుకొనక తమతమ తల్లితండ్రులను కూడ తమతోపాటు ఆడుకొనుమని పట్టుపట్టుదురు. వానియందు తమకు వాస్తవబుద్ధి

లేక పోయినను పిల్లలసంతోషముకొఱకు తల్లిదండ్రులుకూడ తమపిల్లలతోపాటు ఎటుల ఆటలాడుచుందురో అట్లే జ్ఞానులుకూడ కొన్నివ్యవహారములందు లోకుల ననుసరించుచుందురు.

శ్లో. పుష్ణతి పురుషేః సలిలై ర్ముష్ణతి పుష్పం ఫలంచ తరవ ఇవ,
అనువర్తంతే సన్తో హ్యుపకర్తరి చాపకర్తరిచ. ౧౯

తా. వృక్షములు తమ్ము నీళ్లుపోసి పెంచినవారియందును, తమయొక్కపూలను, పండ్లను దొంగిలించినవారియందును సమానముగనున్నటుల జ్ఞానులు తమకు ఉపకారమొనర్చినవారిని అపకారమొనర్చినవారిని సమానముగఁజూతురు.

## వివేకము.

శ్లో. నిత్యానిత్యవివేక స్సర్వేషాం ఘటఘటత్వయో ర్నాస్తే,
స వివేకో య శ్శాంతికృ దవివేకో ౽న్య స్సమస్తో ౽పి. ౨౦

తా. ఘటత్వము నిత్యము ఘటము అనిత్యము. అట్లే బ్రహ్మము నిత్యత్వము, ప్రపంచము అనిత్యము అనెడిజ్ఞాన మందఱకునుండవచ్చును. ఇంతమాత్రముచేతనే యిది వివేకముగాజాలదు ఏది విషయవైరాగ్యమును కలుగఁజేయునో అదియే వివేకము, తక్కినదంతయు అవివేకమేయగును.

శ్లో. అనధిగతే కామసుఖే కాలేన యథా ప్రవర్తతే తరుణః,
ఏవం బ్రహ్మసుఖే ౽పి ప్రవర్తతే కో౽పి భాగ్యవశాత్. ౨౧

తా. యౌవనదశ వచ్చియున్నవాఁడంతకుమునుపు కామసుఖమన నేమియో నెఱుంగకపోయినను ఆకాలమువచ్చినప్పుడు కామసుఖమునందిచ్ఛగలిగి ఎటుల ననుభవించుచున్నాఁడో అట్లే జన్మాంతరకృత పుణ్యవిశేషమువలన ఒకానొకనికి బ్రహ్మసుఖాభిలాష కలుగుచున్నది

శ్లో. పుత్రగుణా స్స్వాతన్త్ర్యే దారగుణా శ్చాధివేదనావసరే,
భ్రాతృగుణా దాయవిధౌ దృష్టవ్యా మోక్ష్యమాణేన. ౨౨

తా. విషయసుఖాభిలాషను వదలదలఁచినవాఁడు పుత్రుఁడు సుగుణవంతుఁడా, దుర్గుణసంపన్నుఁడా యనువిషయమును వానికి సర్వస్వాతంత్ర్య మిచ్చినపిదప తెలిసికొనవచ్చును. భార్యయొక్క సుగుణమును మఱొకవివాహము చేసికొనదలఁచినప్పు డెఱుంగవచ్చును. విభాగకాలమునందు అన్నదమ్ములగుణముల నెఱుంగవచ్చును.

శ్లో. కా మే గతి రితి పృచ్ఛతి చరమశ్వాసే ౽పి య స్స్వార్థమ్,
తస్య జనస్యాపి కృతే పాపాః పాపాని కుర్వన్తి. ౨౩

తా. అప్పుడో, ఆమరుసటిక్షణములోనో ప్రాణములు విడువఁబోవువాని చుట్టుమూఁగి "నాగతియేమి? నాగతియేమి?" యని ఎవ్వరు అడుగుచుందురో అట్టిస్వార్థపరు

లగు బాంధవులనిమిత్తము నీచులు పాపకృత్యము లాచరించుచున్నారు. (అనఁగా బ్రతికినన్నాళ్లు ఎన్నియో కడగండ్లుపడి మనలనుపోషించినాఁడే. అట్టివాఁడు మనలనువిడిచి పోవుచున్నాఁడే. ఇంతకాలము మనకుపెట్టి పోషించినందులకు వానికి కష్టకాలమువచ్చినది కనుక ఏమియయినను సహాయము మనము చేసెదము. అను మాటయేలేక ప్రాణములు పోయేటప్పుడుకూడ నాగతియేమి? నాగతియేమి? యని యడిగెడివారలు పాపిష్ఠులు కాని మంచివారలు కారనియు, అట్టివారలను పోషించునిమిత్తము పాపకార్యము లొనర్చుట నింద్యమనియు భావము.

శ్లో. పితృభిః కలహాయన్తే పుత్రా నధ్యాపయన్తి పితృభక్తిమ్,
పరదారా నుపయన్తః పఠన్తి శాస్త్రాణి దారేషు. ౧౪

తా. ఈకలికాలమునందు తాము తమతలితండ్రులతో ఎల్లప్పుడు జగడమాడుచు తమతమపుత్త్రులకు మాతాపితరులందు భక్తి కలిగియుండవలయునని బోధింతురు. తాము సర్వదా పరస్త్రీలతోడ కామసుఖము ననుభవించుచు తమతమభార్యలకు పాతివ్రత్యమహిమను నూరిపోయుచుందురు.

శ్లో. శాన్తి రలభ్యా దుపరతి రపాత్రభావః ప్రతిగ్రహానివృత్తిః,
క్షాన్తి ర్దుర్బలతేతి చ నివృత్తిధర్మాః కలా వేతే. ౧౫

తా. ఈ కలియుగమునందు నివృత్తి ధర్మములగు శాంతి, ప్రతిగ్రహానివృత్తి, క్షాంతి అనునట్టిధర్మములు యథార్థముగా గనంబడవు. లభించనివస్తువులకయి ప్రయత్నములేకయుండుటయే శాంతి. అపాత్రుఁడయినందువలన ఇతరు లేమియు నొసంగనియెడల ప్రతిగ్రహానివృత్తి, బలహీనతచేత ఓర్పు గనంబడును గాని, వైరాగ్యముచేత శాంతియు, ఇతరులు ఇవ్వవచ్చినప్పటికిన్ని వలదని నిరాకరించుటయు, సామర్థ్యముండియు ఓర్పున్ను కలిగియుండరని భావము.

శ్లో. నీతిజ్ఞా నియతిజ్ఞా వేదజ్ఞా అపి భవంతి శాస్త్రజ్ఞాః,
బ్రహ్మజ్ఞా అపి లభ్యాః స్వాజ్ఞానజ్ఞానినో విరళాః. ౧౬

తా. ఈకలికాలమునందు, రాజనీతి నెఱింగినవారలు, దైవవిధి నెఱింగినవారలు, శాస్త్రము నెఱింగినవారలు, వేదవేత్తలు, బ్రహ్మజ్ఞాన మెఱింగినవారలు గనంబడుదురుగాని తమయజ్ఞానము నెఱింగినవారలుమాత్రము గనంబడరు.

శ్లో. కలికలుషే మనసి స్వైకథ మివ జగ దార్జవం లభతే,
చక్షుర్దోషే జాగ్రతి చాన్ద్రి ద్విత్వం కుతో యాతు? ౧౭

తా. తనమనస్సునందు కలికాలప్రయుక్తదోషము గనంబడుచుండఁగా లోకులు న్యాయముగా నడుచుకొనుచున్నారనుభావ మెట్లుకలుగును? కన్నులకు జబ్బు సంభవించియుండఁగా ఆకండ్లకు చంద్రుని లిద్దఱుగానున్నటులనే తోఁచునుగదా.

శ్లో. విషయాననుకూలయితుంవిషయిణి హృదయేవిధీయతాం యత్నః,
దృశి దేయ మాషధం కో దృశ్యే దత్త్వా కృతీ భవతి. ౨౮

తా. విషయములు తనకు అనుకూలముగా నుండవలయునని తలంచువాఁడు అవి షయముల గ్రహించునట్టి మనస్సును ముందుగా సరిచేసికొనవలయును. కంటియందు వేయదగినమందును కంటియందువేయవలయును గాని దృశ్యమగు పదార్థమునం దెవ్వఁడును వేయఁజాలఁడుకదా. (లోకమునందుఁ గలపదార్థములు బాగుగలేనటుల కంటికి తోఁచినయెడల ఆదోషము కంటిదోషమువలన కలిగినదని భావించి కంటికి చికిత్సచేసి కొన్న పోవునుగాని దృశ్యమగుపదార్థము నెవ్వఁడున్ను సంస్కరింపఁడుగదా. అట్లే విషయము లానుకూల్యముగా లేవని భావించినప్పుడు అవిషయములను పరిగ్రహించు హృదయమును మొదట బాగుచేసికొనవలయునని భావము.)

ఈషణత్రయము.

శ్లో. దారాః పుత్రేషు రతాః పుత్రాః పితృధనపరిగ్రహవ్యగ్రాః,
రోదనశరణా జననీ పరలోకగతస్య కో బన్ధుః? ౨౯

తా. చనిపోయినవానిభార్య అంతకుముందు తనభర్తయందున్న ప్రీతిని పుత్రసంరక్షణమునంగు చూపించును. పుత్రులు తండ్రియందున్నప్రేమను, తండ్రిసంపాదించిన ద్రవ్యమును మూటకట్టుకొనుటయందు చూపించెదరు. తల్లి ఒకమూలకూర్చుండి యేడ్చుచుండును కాని మరణించినవాని మేలునకయి ప్రయత్నించునట్టి బంధువేలేడు.

శ్లో. పశ్యంతిమ్రియమాణాన్మరిష్యతో ఽనుమిమతేస్మరన్తి మృతాన్,
కథయన్తిచైవమసకృచ్చేష్టన్తే నిత్యవత్తు పరమ్. ౩౦

తా. లోకమునందు మనుష్యులు ప్రతినిత్యము చనిపోవుచున్నవారిని చూచుచున్నారు. వీరున్ను అట్లే చనిపోవగలరనియు ఊహించుచున్నారు. మఱియు చనిపోయినవారినిగూర్చి ప్రస్తావించును. "ఎప్పుడో ఒకప్పుడు మనముకూడ పోయ్యేవార మేగాని శాశ్వతముగా నుండబోవువార లెవ్వరునులేరు. ఉన్న నాలుగురోజులు న్యాయ్యముగా బతికి మంచిగతికయి ప్రయత్నింపవలయును" అని ప్రతినిత్యము నోటితో మాట్లాడుచుందురుగాని తమనడవడికమాత్రము తమకెప్పటికిన్నీ చావులేనివారివలెచేయుచుందురు.

శ్లో. కలహాయన్తే మూఢాః కః ప్రతిభూః శ్వః ప్రభాత ఇతి,
తస్యామేవ రజన్యాం కః ప్రతిభూస్స్వస్య సత్తాయామ్. ౩౧

తా. మూఢులగు కొందఱు తాము చిరంజీవులనియు, ఇతరులట్లు కాదనియు, భావించుచు "రేపు మఱల మాకీధనమిచ్చునో యివ్వఁడో ఇందులకు జామీనెవరు?" అని యడుగుదురు కాని ఆరాత్రియంతయు తాను జీవించియుండునని దృఢముగా చెప్ప నెవ్వఁడు జామీనో చెప్పమనుమాతము.

శ్లో. ఆప్రపద మాశిరఃపద మస్తః కలిమలమలీమసే వపుషి,
విఫలం గఙ్గాజల మపి మద్యఘటే దర్భముష్టి రివ. ౩౨

తా. పాదములం మొదలుకొని శిరస్సువరకున్నూ, శిరస్సుమొదలుకొని పాదముల వఱకున్నూ గల దేహమంతయు కామక్రోధాది మలినముచేత దూషితమయియుండఁగా అట్టి మలినదేహమును శుద్ధిచేయుటకు కల్లుకుండయందు దర్భపోచవేసినటుల గంగాజలముమాత్ర మెటుల శుద్ధిచేయఁగలదు? (ఆపాదమస్తకాంతము ద్వేషాదిమలినగుణభూయిష్ఠమయియున్న దేహమును గంగానదిలో ముంచినను లాభములేదు. ద్వేషాదిదుర్గణములు లేనివారలకే గంగాదిపుణ్యతీర్థస్నానఫలములనిభావము)

శ్లో. దణ్డ్యం యత్సుఖహేతోః పుష్ణన్తి జనాః కథం తదేవ వపుః,
నహి శర్కరాభిలాషిభి రిక్షోః కాణ్డాని పూజ్యన్తే. ౩౩

తా. సుఖము కావలయునని కోరువారలు చాంద్రాయణవ్రతాదులచేత దేహమును దండించినగాని ఫలము కలుగఁజాలదు. మూఢులీవిషయము నెఱుంగక యీదేహమును ఎన్నోవిధముల పోషించుచున్నారు లోకమునందు శర్కరకావలయునని కోరువారు చెఱకుగడలను గానుగయందువేసి నలగగొట్టుచున్నారు కాని వానిని పూజించుటలేదు. (అట్లే సుఖాభిలాషగలవాఁడు దేహమును శ్రమపెట్టవలయును గాని దేహమును పూజించుచుండిన యెడల సుఖము లేదనిభావము)

శ్లో. కుల్యాః కృతా విశాలాః కుడ్యాన్యుపలై ర్నిబద్ధాని,
క్రీతా బలినో మహిషాః కృతకృత్యాస్స్మ ఇతి మన్యంతే. ౩౪

తా. చేలకునీరు పాఱుటకుగాను పెద్దపెద్దకాలువల త్రవ్వించితిని. ఇంటిగోడలను రాళ్ళతో కట్టించితిని. బలిసిన ఎద్దులను దున్నలను కొంటిని. కృతార్థుఁడనైతినని తలంచి మురియుచుండును. (కాని పైవానివలన తాను తరింపగలక్రోవ యేమయినగలదా లేదాయని మాత్రము తెలిసికొనలేకపోయెనుగదా యని భావము)

శ్లో. ప్రాయో ముహ్యతి చేతః ప్రాణభృతః ప్రాణనిర్గమావసరే,
పుణ్యేన యది న ముహ్యతి పుత్రానేవ స్మరన్మ్రియతే. ౩౫

తా. సామాన్యముగా ప్రతిమనుష్యునకున్నూ మరణకాలమునందు స్మృతి తప్పియుండును జన్మాంతరకృత పుణ్యవశముచేత ఒకానొకనికి అట్టిస్మృతి తప్పకయున్న యెడల (తనకు సద్గతిని కలుగజేసెడి భగవద్ధ్యానమునుచేయక) బిడ్డలను తలంచుచు ప్రాణముల వదలుచున్నాఁడు.

శ్లో. శమయితు మాదర మగ్నిం సంసారే సాగరే నిమజ్జంతి,
తుహినవ్యథానివృత్త్యై నహి వేశ్మని పావకో దేయః. ౩౬

తా. ప్రపంచమునందు మనుష్యులు తమజఠరాగ్నిని చల్లార్చుకొనుటకుఁగాను సంసారసాగరమునందు మునుఁగుచున్నారు శీతబాధానివారణార్థ మెవ్వఁడును తనయింటికి నిప్పంటించుకొనఁడుగదా (అనఁగా అల్పమయినజఠరబాధను నివారించుకొనుటకుగాను సంసారభారమునంతయు మోసికొనితిరుగువాఁడు చలిబాధశమించుటకు యింటికి నిప్పంటించుకొనువానివలె మూర్ఖుఁడని భావము.)

శ్లో. అర్థానా మధికానాం రాజ్ఞా చోరేణ వా ధ్రువో నాశః,
అన్నే ఖల్వతిభుక్తే వమనం వాస్యా ద్వి రేకో వా. ౩౭

తా. తానుతినక ఇతరులకుపెట్టకపోవుటచేత ధనమొకచోట నధికముగచేరునెడల దానికి రాజులవలనఁగాని దొంగలవలనఁగాని హానిసంభవించును. అన్నమును మిక్కుటముగా తినినయెడల అదిజీర్ణముకాక వమనమో లేక విరేచనములో కలుగుచుండుట లోకానుభవసిద్ధముగదా.

శ్లో. ఆహృత్య పరిత్యక్తా జనయ న్త్యర్థా స్సుఖాభాసమ్,
అత్యంతాయ త్యక్తాః పరమానందాయ కల్పన్తే. ౩౮

తా. సంపాదించినద్రవ్యమును కొద్దిగావ్యయమొనర్చినయెడల ఏదో ఒకవిధమైన సుఖమును కొంచెమొసంగును. ఆద్రవ్యమునే బుద్ధిపూర్వకముగ విరక్తిచే వదలినయెడల బ్రహ్మనందసుఖ మలవడును.

శ్లో. ప్రణమతి పరిసాంత్వయతి ప్రలపతి పతతి చ పరిభ్రమతి,
ఆవిష్ట ఇవ పిశాచ్యా పురుష స్తృష్ణావశం యాతః. ౩౯

తా. తృష్ణావశము నందినపురుషుఁడు దయ్యముపట్టినవానివలె ఇతరులఁగాంచి దండములఁబెట్టును. బతిమాలును. నోటికివచ్చినట్లు వాగుచుండును. కన్నులకు గనంబడినవానినెల్ల దీనుఁడయియాచించుచుండును. దేశదేశములు కాళ్ళలుగునటుల తిరుగుచుండును.

శ్లో. జననాదృష్టా త్పితరౌ పుత్రా జామాతరో వ్యయాదృష్టాత్,
కలహాదృష్టాత్ జ్ఞాతయ ఇతి ఇతి నిర్ణీతే కిమేష్టవ్యమ్. ౪౦

తా. పుట్టవలసిన కర్మమున్నయెడల తల్లితండ్రులవశ్యము ఏర్పడుదురు. సెలవు చేయవలసిన యదృష్టమున్నచో కొడుకులు అల్లుండ్రు యేర్పడెదరు పోట్లాడుచుండవలసిన కర్మమున్నయెడల జ్ఞాతులధికముగానుందురు. ఇందులకయి ప్రయత్నింపనక్కరలేదు.

శ్లో. స్వపితుః పరలోకాయ స్వయ మనుదివసం యదాచరతి,
క్రియతా మిద ముపమానం కిం నాలం పుత్రవైరాగ్యే. ౪౧

తా. లోకమునందెవనికివాఁడు "తనతండ్రికి స్వర్గాదిపుణ్యలోకములు కలుగుటకుగాను ప్రతిదినము తానేమిచేయుచున్నాఁడో" అనునది తలంచుకొనునెడల యీ

దృష్టాంతమే పుత్త్రేషను వదలనలయునని బోధించును. అనఁగా తనతండ్రినుద్ధరించుటకు తాను ఏమియు చేయుటలేదనువిషయము తనకు తెలిసియేయున్నది కావున తనపుత్త్రులు తన్నుద్ధరింతురనుభావముకూడపోయి పుత్త్రేషణ నశించుననిభావము.

శ్లో. అననుగతే దారిద్ర్యే కిమనుగతం లక్షణం దృష్టమ్,
కామస్యాపరిపూర్త్యా కృపణం జగ దాచతుర్వదనాత్. ౪౨

తా. దారిద్ర్యములేనివానికి ఆశయుండును. ధనికుఁడగువానికి ఆశయుండదు. అనినిర్ణయింపవలనుపడదు కావున పిపీలికాది బ్రహ్మపర్యంతముగల జగమంతయు ఆశాపీడితమయియుండునేని హీనముగా నేతోఁచును.

శ్లో. నఖలు ధనత్వం జాతి ర్యస్య యదిష్టం తదేవ తస్య ధనమ్,
తత్తదివ పామరాణా మాకించన్యం ధనం విదుషామ్. ౪౩

తా. ధనమనునది ఒకజాతికాదు. ఏవస్తువు యెవ్వనికియిష్టమో ఆవస్తువు వానికి ధనమగుచున్నది. పామరులగువారలు రూపాయీలను ధనమనిభావింతురు. బ్రహ్మవేత్తలు ఏమియులేకయుండుటనే అనఁగా దరిద్రమునే ధనముగాభావింతురు.

శ్లో. స్వీక్రియతే యది తృష్ణా స్వీకర్తవ్యం జగత్సమస్తమపి,
స్వీక్రియతే యది శాన్తి స్సాప్యాత్మా ఽపి స్వస్య భవతి న వా. ౪౪

తా. జనులు ఆశాపిశాచమునకు దాసులయినయెడల ముల్లోకములుకూడ వారు పరిగ్రహింపవలసినదే (అప్పటికిన్ని వారికి ఆశతీరగు) వైరాగ్యముకలిగి శాంతినివహించినయెడల తమదేహమునుకూడ వారు తమదిగాభావింపరు.

శ్లో. యద్దాతారం నశయతి యత్పరిజన మస్య సాన్త్వయతి,
యదపత్రపతే చాన్త ర్యాపీ లాభ స్స కస్య నమః. ౪౫

తా. దాతయొక్క అనుగ్రహముపడయుటకయి ప్రయత్నించుట, దాతయొక్క నౌకరులతో మంచిమాటలుమాట్లాడుచు వారిపరిచయముసంపాదించుట ఇట్టి తుచ్ఛపుకార్యమునకులోఁబడుచున్నామే యని లజ్జలేకపోవుట. యను యకృత్యములకు లోఁబడినపిదప రాబోవులాభమువలన కలుగఁబోవునదిమాత్ర మెట్టిదిగానుండనోపును? (మానముపోయినతర్వాత వచ్చెడిధనలాభముకంటె నీచమయినది మఱొక్కటిలేదనిభావము.)

శ్లో. ప్రాదేశమాత్ర ముదరం పరిపూరయితుం కియా నయం యత్నః,
చుళకేనాప్యమ్భః పాతుం ఖనితవ్యః కిం తటాకో ఽపి. ౪౬

తా. పట్టెడన్నముతోఁ పూడునట్టి జిట్టెడుపొట్టనునింపుటకుఁగాను లోకులుచేయు అట్టహాసముచూడగా పుడిసెడునీరుత్రాగుటకుఁగాను చెరువును త్రవ్వుటకు ప్రయత్నించునటులనున్నది.

శ్లో. యామార్ధ మసంస్కారా ద్యామద్వయ మనశనాచ్చ సువ్య క్తే,
శారీరే సౌన్దర్యే ఉష్యభినివిశ న్తే కియ న్మూఢాః. ౪౭

తా. తనదేహముయొక్క చక్కదనము ఒక్కజాముసేపు తోముకొనకపోవుట వల్లను, రెండుజాములు అన్నమును తినకపోవుటవల్లను బట్టబయలగుచున్నది. ఇట్టి పాడు దేహమునందుకూడ పామరు లెంతో వ్యామోహముచెంది సింగారించుకొనుచున్నారు.

కా మ ము.

శ్లో. వన్ధ్యేత్యాహు స్తరుణీం జరతీతి పరిత్యజంతి బహుపుత్రామ్,
అధివిన్నే త్యల్పసుతాం కా గృహిణీ కామినాం హృద్యా. ౪౮

తా. కాముకులు నడిమివయసునందున్న స్త్రీని "వంధ్య" యని దూషింతురు. బిడ్డలుగలదానిని "ముసలిది" యని యీసడింతురు. ఒక్కబిడ్డగలదానినికూడ నిందింతురు. కాముకుల కట్టిభార్యమంచిదో తెలియుటలేదు.

శ్లో. యాన్తి శుచ మకృతదారా ద్వే భార్యే నేతి కృతదారాః,
తే పరదారా నేతి స్త్రీభి స్తృప్తా న్న పశ్యామః. ౪౯

తా. పెండ్లికాని బ్రహ్మచారులు పెండ్లికాలేదేయని యేడ్చుచుందురు. పెండ్లిచేసుకొన్నవాడు యిద్దఱు పెండ్లాలు లేకపోయిరేయని యల్లాడును. యిద్దఱుపెండ్లాలుగలవాఁడు పొరుగింటివానిపెండ్లాము చక్కగానున్నదే దానినెట్లు సాధింపవచ్చునని తంటాలుపడును కనుక స్త్రీలవలన తృప్తినందినవారులేరు.

శ్లో. మదనస్యాజ్ఞాకరణే మన్యే జగ దఖిల మేకరూప మిదమ్,
తిర్యంచ ఇతి నరా ఇతి దేవా ఇత్యస్య కో భేదః?. ౫౦

తా. ప్రపంచమునందుగల ప్రాణులలో పశుపక్ష్యాదులని, మనుష్యులు అని దేవతలని భేదముమాత్రము ఇతరవిషయములందున్నను మన్మథుని యాజ్ఞాపరిపాలనమునందు మాత్ర మందఱు నొక్కవిధముగనే చరించుచున్నారు.

శ్లో. శుక్లవిమోకస్థానం మలమూత్రత్యాగదేశవ త్కిమపి,
స్త్రియ ఇతి విహితం విధినా కియ దత్ర జనా నిమజ్జన్తి. ౫౧

తా. బ్రహ్మదేవుఁడు మలమూత్రములను విడలునట్టిదియు, రేతస్సునువిడలుటకు స్థానభూతమయిన ఒకానొకయంగమును స్త్రీలకేర్పఱిచెను. జనులందఱు దానియందు పడి మునుఁగుచు తేలుచున్నారు.

శ్లో. వేదా నధీత్య విధివ న్మీమాంసిత్వా తదర్థంచ,
దారాః క ర్తవ్యా ఇతి కేనేదం ప్రహసనం కథితమ్. ౫౨

తా. వేదములన్నియు అభ్యసించి చక్కఁగా ఆవేదార్థవిచారముసలిపి తరువాత

వివాహముచేసికొనవలయు ననుప్రహసనము నెవ్వఁడువ్రాసెనో తెలియలేను. (అనఁగా వేదాధ్యయనముచేసి తదర్థవిచారణము సలిపినవారలకుకూడ కామపాశములకు లోనగుట విచిత్రముగ నున్నదని భావము)

శ్లో. దుఃఖేనోపార్జ్యన్తే పాల్యన్తే ప్రత్యహం చ లాల్యంతే,
వామా స్త్రియో విమూఢై రుపభుఞ్జానా స్సుఖం ద్విగుణమ్. ౫౩

తా. రెండింతలు సుఖమనుభవించుచున్న యందగత్తెలను మూఢమానవులు అనేక కష్టములుపడి సంపాదించుచున్నారు. వారిని అతిజాగ్రత్తగా ఇతరులకు కంటబడకుండ కాపాడుచున్నారు. వారికి వలయు పదార్థముల సేకరించి యొసంగి వారిని బుజ్జగించుచున్నారు (ఇదియంతయు కామోన్మాదమని భావము.)

శ్లో. అశ్నీత పిబత ఖాదత జాగ్రత సంవిశత చలత తిష్ఠత వా,
సకృదపి చిన్తయతాహ్నా న్నావధికో దేహబన్ధ ఇతి. ౫౪

తా. జనులారా! మీరు ఎన్నిపర్యాయములు తిన్నను తినుఁడు. త్రాగిన త్రాగుడు. నమలుఁడు. మేలుకొనుఁడు. నిద్రపోవుఁడు తిరుగుడు. కూర్చుండుడు ఇవి యెన్నిపర్యాయములు చేయుచున్నను, ఈదేహము శాశ్వతముకాదను విషయమును ఒకమారైనను జ్ఞప్తికి దెచ్చుకొనుఁడు

శ్లో. కింవిజితయా పృథివ్యా కిం కాంచనభూభృతా కరస్థేన,
కిందివ్యాభి స్స్త్రీభి ర్నశ్వర్తవ్యే బ్రహ్మణా లిఖితే. ౫౫

తా. ఈదేహ మెప్పుడో ఒకప్పుడు నశించిపోదగినదే యని బ్రహ్మదేవుఁడు వ్రాసియుండఁగా భూమియంతయు జయించి సార్వభౌముఁడయి రాజభోగము లనుభవించిన నేమి ప్రయోజనము? బంగారుకొండను అఁచేతనుంచుకొన్న ప్రయోజనమేమి? రంభాది దేవతాస్త్రీలతోడ కామసుఖముల దేలిన నేమి ప్రయోజనము?

శ్లో. జీవతి కతిచి న్నిమిషాన్ కతిచి త్తేషు శ్రుతి రధీత ఇవ,
తావ త్త్యేవాకులయతి తంత్రాణి నవాని చాతను తే. ౫౬

తా. మనుష్యుఁడు జీవించునదియే కొన్నినిముషముల కాలము. (అనఁగా అల్పకాలము) అందులో కొంతకాలము వేదశాస్త్రములఁ జగువుచున్నాఁడు అందులోనే సకలశాస్త్రములందు ప్రావీణ్యము గడించుచున్నాఁడు. క్రొత్తక్రొత్త గ్రంథములను నర్చుచున్నాఁడు. (మనుష్యునకుండు ఆయుష్షు అతి స్వల్పకాలము కావున అతని ఆయుష్కాలమునందు చదివిన చదువుతో వేదశాస్త్రము తత్త్వము నెఱుంగుట అశక్యమని భావము.)

శ్లో. స్వల్పో జీవనకాలః స్వల్పాధీః పరిచయ స్సువల్పః,
తదపి తరేమ కథం చి చ్ఛ్రితరో యది నోపజాయన్తే. ౫౭

తా. మనుష్యులమగు మనకీలోకమునందు ఆయుస్సే చాల స్వల్పము, బుద్ధియు స్వల్పమే, శాస్త్రప్రవేశమా మిక్కిలియు స్వల్పమే, అట్లయినప్పటికిన్ని వేదశాస్త్రము అనునవి లోకమునం దుండుటచేతనే ఎట్లో యొకవిధముగ సంసారసాగరమును తరించుచున్నారము.

## సంసారము.

శ్లో. కుత ఆగతం న జానే క్వను వా గన్తవ్య మిద మపి న జానే,
సంచరసి క్వేదానీం సంసారపథే మహాతమసి ౫౮

తా. నేను ఎచ్చటినుండి వచ్చినాడనో నాకుతెలియదు ఎక్కడికి పోవలయునో అదియు తెలియదు. గాఢాంధకారమగు సంసారమార్గమునందుమాత్ర మిప్పుడుపడి దారి తెలియక పడినతావునకే మఱలమఱల తిరిగివచ్చుచు కాలయాపనము చేయుచున్నాఁడను.

శ్లో. తమసా ఉవృతా శ్చర న్త స్సవిధే దూరేచ నావయ న్త్యర్థాన్,
అవయన్తి తు విస్పష్టం తదితి శిరస్యభిహతే మూఢాః. ౫౯

తా. గాఢాంధకారమందు దోవతప్పి తిరుగాడుచున్నవారలు సమీపమునందుఁగాని దూరమునందుఁ గాని గల పదార్థముల తెలిసికొనఁజాలరు గాని తలకు దెబ్బతగిలి తలకు బొప్పికట్టగా అచ్చటనే మోయుచున్నదని మాత్రము స్పష్టముగా నెఱుంగుదురు.

## స్వర్గము.

శ్లో. నిమిషంత్యత్ర తరుణ్య స్తత్ర తరుణ్యో న నిమిషంతి,
ఈదృక్షో హి విశేష స్స్వర్గ స్స్వర్గ ఇతి కిం తత్ర. ౬౦

తా. ఈలోకమునం గఁగల స్త్రీలు కన్నులుమూయుచు తెఱచుచునుందురు. స్వర్గమునందుండు స్త్రీలు కన్నులు ఎల్లప్పుడు తెఱచుకొనియుందురు. ఈలోకమునకు స్వర్గలోకమునకు భేదమిదియే. అందేమియు విశేషములేదు.

శ్లో. కోపో మైత్రావరుణే శ్శాపో వా తార్కికస్య మునేః,
సంస్మర్యతే యది సకృ చ్ఛత్రో రపి మాస్తు శక్రపదమ్. ౬౧

తా. అగస్త్యమహామునికి ఇంద్రునిపైవచ్చిన కోపమునుఁగాని, గౌతమమహర్షి యింద్రునకిచ్చిన శాపమునుఁగాని తలంచినయెడల తనశత్రువునకు కూడ ఇంద్రపదవి వలదని మొరపెట్టును. (అగస్త్యమహర్షికి పూర్వకాలమునం దొకప్పుడు ఇంద్రునిమీద కోపమువచ్చి అతనిని సర్పమైపడియుండుమని శాపమొసంగెను, అను కథయును ఇంద్రుఁడు గౌతమునిపత్నియగు అహల్యతో వ్యభిచరించగా గౌతముఁడెఱింగి ఇంద్రుని "దేహమునిండ సహస్రయోనుఁడవు అగుదువుగాక" యని శపించిన కథయు జ్ఞప్తికి వచ్చినయెడల మనశత్రువులకుకూడ యిట్టి నీచస్థితివలదని కోరుననిభావము.

శ్లో. గచ్ఛత్వమరావత్యాం గచ్ఛతు చతురాననస్య వా నగరే,
పునరాగన్తవ్యం యది పుంసాం కిం సాధితం భవతి? ౬౨

తా. యజ్ఞయాగాదులొనర్చి స్వర్గలోకమునకుఁ బోయినను, ఉపాసనాదికమొనర్చి బ్రహ్మలోకమునకుఁ బోయినను మఱల భూలోకమునకు తిరిగివచ్చి పుట్టవలసియున్నయెడల మనుష్యుఁ డేమిసాధించినట్లు? (అశాశ్వతములగు స్వర్గాదిసౌఖ్యములకు ప్రయత్నింపక మోక్షము నిమిత్తము ప్రయత్నింపవలయునని భావము )

శ్లో. భుక్తా బహవో దారాః లబ్ధాః పుత్రాశ్చ పౌత్రాశ్చ,
నీతం శత మప్యాయు స్సత్యం వద ముక్త మస్తి మనః. ౬౩

తా. ఎందఱనో భార్యలపెండ్లాడి భోగము లనుభవించితివి? కొడుకులను, మనుమలను ఎత్తితివి? నూరేండ్లునిండ బ్రతికితివి? ఇప్పటికయినను చావున నీవు సిద్ధముగా నున్నావా? ఓమనస్సా! నిజము చెప్పుము.

శ్లో. విశ్లేషణస్వభావా న్విషయా స్స్పృశ్యాన్ కరోతి కో మమతామ్,
నశ్యదవస్థాపన్నం కః క్రీణీతే ధనై రశ్వమ్. ౬౪

తా. ఎప్పటికప్పుడు వదలిపోవు స్వభావముగల విషయములం దెవ్వఁడు మమకారము వహించును? బుద్ధిమంతుఁడగు వాఁడెవ్వఁడును చావ సిద్ధముగా గుఱ్ఱమును డబ్బిచ్చి కొనఁజాలఁడుగదా.

శ్లో. అన్నాభావే మృత్యు శ్శాలిభి రన్నాని శాలయో వృష్ట్యా,
వృష్టి స్తపసేతి వద న్న మృత్యవే త త్తప శ్చరతి. ౬౫

తా. అన్నములేనియెడల చావు ఏర్పడును. అన్నము ధాన్యమువలన కలుగును. ధాన్యము వర్షమువలన కలుగును. వర్షము తపస్సువలన కలుగును. అని అన్నార్థియై తపముసల్పునుగాని మరణరాహిత్యమున కని యేల తపముసల్పరాదో తెలియుటలేదు.

శ్లో. కిం న నిగృహ్ణంతి మనః కిం న భజన్తే జనా శ్శివం శరణమ్,
అభిసన్ధిభేదమాత్రా న్మోక్షోపాయే నబధ్యంతే. ౬౬

తా. మనుష్యులు మనస్సును యొకచోట దృఢముగా కట్టివేయుచునేయున్నారు. పరమశివుని పూజించుచునే యున్నారు. అయినను ఉద్దేశభేదముండుటచేత ముక్తినందక సంసారపాశమున తగుల్కొనుచున్నారు. (అనఁగా అయాసౌఖ్యములు కావలయునని సకామపూజచేయుటవలనను, అట్టిధ్యానము సలుపుటవలనను అశాశ్వతమగు సౌఖ్యమును పొందుచున్నారు కాని ముక్తి వారికి లభించుటలేదనిభావము.

శ్లో. భోగాయ పామరాణాం యోగాయ వివేకినా న్తు కరణ మిదమ్,
భోగాయ చ యోగాయ చ న కల్పతే దుర్విదగ్ధానామ్. ౬౭

తా. పామరులు దేహమును ఇంద్రియసౌఖ్యానుభవార్థము పోషించుచున్నారు. వివేకము గలవారలు యోగముకొఱకు శరీరమును పోషించుచున్నారు. రెంటికిం జెడిన యల్పజ్ఞానులు భోగమునకు యోగమునకు గాక వ్యర్థముగ బోషించుచున్నారు.

శ్లో. బ్రాహ్మణచణ్డాలా ఇత్యాహ మను ర్యన్మహాపథికాన్,
భవమార్గమహాపథికా నధికృత్యైవ ప్రవృత్తం తత్. ౭౮

తా. ధర్మశాస్త్రవేత్తలలో నగ్రగణ్యుఁడగు మనువు మహాపథికులను అనఁగా చెడ్డనడతగలవారలను "బ్రాహ్మణచండాలురని" వచించెను ఆమాట "భవమార్గమహాపథికులను" గూర్చియే చెప్పినాఁడు. భవమార్గమహాపథికులనఁగా జన్మమరణరూపమగు సంసారమనెడి దుర్మార్గము నవలంబించినవారలని భావము.

శ్లో. ఏకద్వాః క్షితిపతిషు ద్విత్రా దేవేషు పంచషా ద్రుహిణే,
ఏతావన్తో జగతి బ్రహ్మానందార్ణవస్య కణాః. ౭౯

తా. ఈమనుష్యలోకమునందు బ్రహ్మానందసుఖములేదు. యొకవేళ యున్నదను కొనునెడల ఆబ్రహ్మానంద మహాసముద్రముయొక్క యొకటిరెండు బొట్లు సార్వభౌములగు రాజులయందును, రెండు మూడు బొట్లు దేవతలయందున్నూ, ఐదు ఆరు బొట్లు బ్రహ్మదేవునియందున్నూ ఉండవచ్చును. (అల్పములయిన దేవాదిపదవులుఁగోరుటకంటె బ్రహ్మానందసౌఖ్యము నొసంగు ముక్తిఁగోరుట మంచిదనిభావము.)

శ్లో. అజ్ఞానేనావిహితే విజ్ఞానే కర్మ కిం కురుతే,
విఫలే చక్షుషి తమసా వ్యాదాయ ముఖం కి మిక్షేత? ౮౦

తా. అజ్ఞానముచేత విజ్ఞానము నశించియుండఁగా చీకటిలో కన్నులు తెలియక యుండునప్పుడు మొగమెత్తిచూచినను ఏమియు తెలియనిరీతిగా ఎట్టి సత్కార్యము నొనర్చుటకున్నూ అవకాశముండదని భావము

అల్పజ్ఞానము.

శ్లో. అతికలుష మాశు నశ్వర మాపాతస్ఫురణ మనభిలాషకరమ్,
అపిహ్లాదయంతి జనాః కథ మవలంబ్య జ్ఞానఖద్యోతమ్. ౮౧

తా. జనులు మిక్కిలి మలినమయినదియు, శీఘ్రముగా నశించు స్వభావముగలదియు, క్రిందబడునంతవఱకు మిణుకుమిణుకుమని గనంబడుచుండునదియు, అగు అజ్ఞానమను మిణుగురుపురుగును తాము గలవారలయి తమయందేదో మహాజ్ఞానమున్నట్లు మురియుచుందురు.

శ్లో. ప్రయుతం నియుతం వాఽపి ప్రదిశంతి ప్రాకృతాయ భోగాయ,
క్రీణంతి న బిల్వదలైః కైవల్యం పంచషై ర్మూఢాః. ౮౨

తా. పామరులు లక్షలు కోట్లు ఇంద్రియభోగానుభవార్థము వెచ్చించుదురు గాని ౫, ౬, బిల్వదళములను మాత్రము కైవల్యసుఖార్థ మువయోగింపఁజాలరు. (అనఁగా ద్రవ్యవ్యయములేకయే సులభముగ లభించునట్టియు, శాశ్వతమయినట్టియు భోగము నిమిత్తము ౫,౬, బిల్వదళములతో శివునిపూజించుటకు మాత్రము మూర్ఖులకు మన స్సురాదని భావము.)

శ్లో. యావత్కాల చేష్టంతే తావ త్పాశేన బధ్యతే గ్రంథిః,
నిభృతం యది వర్తంతే కాలేన స్రంసతే పాశః. ౨౩

తా. (త్రాఁడు ముడిపడియున్నప్పుడు) ఆత్రాటిని ఇటు అటు లాగుచున్నయెడల ముడి అంతకంతకు బిగిసికొని పోవును గాని వీడిపోదు. కదలింపకయున్నయెడల కొంత కాలమునకు ఆముడివదలి జారిపోవును. (పుట్టినందులకు ఊరకుండుట యెందులకు? వయ సున్నంతవఱకు సంసారసౌఖ్యము ననుభవించి చివరకు విరక్తినందెదమని తలంచునెడల అది యసాధ్యమనియు, మొట్టమొదటినుండియే వైరాగ్యము కలిగియున్నఁ గాని ముక్తి లభింపదనియు భావము.)

శ్లో. ఉపరుంధంతి శ్వాసా న్మునయో నాశ్నంతి న పిబంతి,
స్తూయన్తే కిం మునయః కంఠే కుర్వన్తి కనకపాశ మిమే. ౨౪

తా. మునీశ్వరులు ప్రాణాయామపరాయణు లయి శ్వాసముల బిగబట్టుచున్నారు. అన్నపానీయముల ముట్టుటలేదు. బంగారుసొమ్ముల ధరించుటలేదు కావున వారినందఱు కొనియాడుచున్నారు. (జితేంద్రియులగు వారలనే లోకులు కొనియాడుదురు గాని ఉదరపోషణపరాయణుల నెవ్వరు కొనియాడరని భావము)

శ్లో. కామం జనాః స్మయన్తే కైలాసవిలాసవర్ణనావసరే,
సాధనకథనావసరే సాచీకుర్వంతి వక్త్రాణి. ౨౫

తా. కైలాసలోకమునందుఁ గల చిత్రచిత్రవిలాసములను వర్ణించి చెప్పునప్పుడు జనులందఱు చెవులు నిక్కపొడుచుకొని వినుచు హాసన్ముఖులయియుందురు కాని ఆకై లాసమునకుఁబోవు సాధనములఁ జెప్పునప్పుడు మాత్రము మూతులు ముడుచుకొనుచు న్నారు. (కైలాసలోకమునందుఁ గలసౌఖ్యముల ననుభవించుటకు కుతూహలముమాత్ర మందఱకుఁగలదుఁ గాని అందులకు తగినప్రయత్నమునుమాత్ర మెవ్వరుచేయరనిభావము.

శ్లో. వంగాః కథ మంగాః కథ మిత్యనుయుజ్తే వృథా దేశాన్,
కీదృక్కృతాంత పుర మితి కో ఽపి న జిజ్ఞాసతే లోకః. ౨౬

తా. వంగదేశ మెట్లుండును? అంగదేశ మెట్లుండును? అని వ్యర్థముగా దేశదేశ ముల విషయములను తెలిసికొనప్రయత్నింతురేగాని తానవశ్యముపోయి తీరవలసిన యమపురి యెట్టిదని మాత్ర మెవ్వఁడును విచారింపఁడు.

శ్లో. త్యక్తవ్యో మమకార స్త్యక్తుం యదిశక్యతే నాసౌ,
కర్తవ్యో మమకారః కింతు స సర్వత్ర కర్తవ్యః ౭౭

తా. నేను నాదియను మమకారమునువదలుట ముఖ్యము, ఆతీరుగ మమకారమును వదలుట అశక్యమయినయెడల ఆమమకారమునే అందఱియందును ఉంచవలయును. (కొందఱియందుమాత్రము నావారని మమకారము, కొందఱియందు ఇతరులని ద్వేషము వదలి అందఱియందును మమకారమునే గనంబఱుచుట అత్యావశ్యకమనిభావము.)

శ్లో. పుత్రా ఇతి దారా ఇతి పోష్యా న్మార్గో బహిర్జనా భ్రాతే,
అంధే తమసి నిమజ్జ న్నాత్మా పోష్య ఇతి నావైతి. ౭౮

తా. జ్ఞానవిహీనుఁడగువాఁడు తనకంటె భిన్నులయిన కొడుకులు, భార్య, మున్నగువారలు, తనచేత పోషింపఁదగినవారలని జెప్పుకొనుచుండును గాని గాఢాంధకార సంసారకూపమునఁ బడి మునిఁగిపోవుచున్న తన్ను పోషించుకొన వలయునను విషయమునుమాత్రము మఱచిపోయినాఁడు.

శ్లో. యచ్చింతిత మధిగర్భం యచ్చ చిరం చిన్తితం నరకే,
విషయానిలసంసర్గా న్మమృజే త త్సర్వ మేకపదే. ౭౯

తా. జీవుఁడు గర్భవాసనరక మనుభవించుచున్నప్పుడు ఏది యాలోచించుకొని యుండెనో, రౌరవాదినరకములందు యాతన లనుభవించుచున్నప్పు డేమితలంచెనో అది యంతయు సంసారారణ్యమున ప్రవేశించినవెంటనే ఒక నిమిషమునందే మఱచిపోవుచున్నాఁడు.

శ్లో. బాహ్యాగతాగతశీలా ప్రాణస్య శ్వాసలక్షణా వృత్తిః,
కర్షతి మనసో వృత్తిం కులటేవ కులస్త్రియం ముగ్ధామ్. ౮౦

తా. దేశద్రిమ్మరియగు వ్యభిచారిణి అశుభము శుభము తెలియని కులాంగనయింటికి అప్పుడప్పుడు వచ్చిపోవుచుండి కొంతకాలమునకు ఆకులాంగననుకూడ తన దుర్వృత్తికి లాగునటుల వెలుపలి విషయభోగములందు వ్యాపించిన ప్రాణవృత్తి మనస్సును కూడ దుర్విషయముల కీడ్చుచున్నది.

భక్తి.

శ్లో. అతిగంభీర మనావిల మక్షోభ్య మదృష్టపార మవిలంఘ్యమ్,
అవిరళతరంగసంకుల మైక్షిషి విజ్ఞానసాగరం మహాత్మామ్. ౮౧

తా. మిక్కిలి లోతు అయినదియు, నిష్కల్మషమును, చలనములేనిదియు, అంతము గనంబడనిదియు, దాటశక్యముకానిదియు, అలల తాకుఁడులేనిదియు అగు మహాత్ముల విజ్ఞానసముద్రమును నేను కనుగొంటిని.

శ్లో. ఘోరం భవ మపహాతుం కేచి దఘోరం భవం ప్రపద్యన్తే,
సంసరణకాతరాణాం సంసరణం శాంభవీ భక్తిః. ౮౨

తా. భయంకరమయిన సంసారసాగరమును దాటుటకొఱకు కొందఱు జ్ఞానులు అభయంకరుఁడగు శివు నాశ్రయించుచున్నారు. సంసారభీతులగు వారిభయమును పోగొట్టునది శివభక్తియే సుమీ.

శ్లో. పాశో యది మోక్తవ్యః పశుపతి రేవానుసర్తవ్యః,
న ఖలు వ్యతిముచ్యంతే పశవః పాశేన సంబద్ధాః. ౮౩

తా. సంసారపాశబద్ధులగు జీవులు పాశమునుండి విముక్తులుకావలయునని తలంచునెడల పశుపతియగు పరమశివునే యాశ్రయింపవలయును. పశుపతిని సేవింపనిది సంసారపాశబద్ధులగు జీవులు విముక్తి నందఁజాలరు.

శ్లో. అలమల మనుభూతాభి ర్మాతృభి రల మస్తు పితృభి శ్చ,
భవితవ్యం యది నిత్యవ దర్ధం మాతుః పితు శ్చాస్తు. ౮౪

తా. ఇంతవఱకు నేను అనుభవించియున్న తల్లులును, తండ్రులును నాకుచాలును. (అనఁగా అనేకజన్మము లెత్తియెత్తి యెందఱో తల్లులని తండ్రులని భావించినది చాలును ఇఁక జన్మ మక్కఱలేదని భావము) తల్లితండ్రు లక్కఱలేదని చెప్ప వలనుపడగు ఉండియే తీరవలయునను నెడల సగము తల్లియు, సగము తండ్రియు అగు నిత్యమాతాపితృమత్త్వము నాకు సిద్ధించుఁగాక. (అర్ధనారీశ్వరుఁడగు పరమేశ్వరుఁడే నాకు తల్లియు తండ్రియు కావలయునుఁ గాని తదితరులగు తల్లితండ్రులు వలదని భావము.)

శ్లో. ధన్యాస్తే బహుదేవా స్స్వామిని యేషాం న దుర్భిక్షమ్,
జాతు న జానీమో వయ మేక మపి స్వామినం పూర్ణమ్. ౮౫

తా. ఎవరికి దేవతలయొక్క దరిద్రత్వములేదో వారు ధన్యులు. వారికి సమృద్ధిగా దేవతలుగలరు గదా. కాని మేముమాత్రము ఒక్కదేవునిఅయినను పూర్ణముగ నెఱుంగ సమర్థులము కాము. కావున ఆయొక్కనినే పూర్ణముగ నెఱుంగుటకయి ప్రయత్నించెదము. (ఆదేవత యీదేవతయని పలుగులెత్తుటకంటె ఒక్కదేవతను చక్కఁగా నారాధించుట యుత్తమమని భావము.)

శ్లో. సన్తు బృహన్తో దేవాః కింతు న తాన్నంతు మీహతే చేతః,
అధ్యనదాన్యన్యాయా దంతకజిత మేవ చింతయతే. ౮౬

తా. గొప్పగొప్పదేవత అనేకులుండిన యుండనిమ్ము కాని వారి నొకప్పుడైనను నమస్కరించుటకు మాకు చిత్తము రాదు. అధ్యవదాన్యన్యాయము ననుసరించి అంతకాంత

కుండగు మృత్యుంజయునే సేవించెదము (జననమరణరాహిత్యముఁ గోరువారలు మృత్యుంజయుని సేవించినయెడల మృత్యుబాధనుండి విముక్తులగుదురని భావము)

శ్లో. నిధ్యాయసి విషయసుఖం న ధ్యాయసి విషమ మస్య పరిపాకమ్,
బన్ధం తమేవ చిన్తయ బద్ధం మోక్షుం చ యః క్షమతే. ౮౭

తా. ఓజీవుఁడా! విషయసుఖాభిలాషను గనంబఱచెదవు కాని ఆవిషయసుఖాభిలాషవలన కలుగఁబోవు అనర్థమునుమాత్రము మాలోచించుటలేదు. ఏపరమేశ్వరుఁడు జీవుల సంసారపాశబద్ధులనుగా నొనర్చుటకును, పాశవిముక్తులనుగా నొనర్చుటకును సమర్థుఁడో అట్టి లోకబంధువునే స్మరించుము.

శ్లో. సదనం గుహాపసదనం శరణం పఞ్చాక్షరీపురశ్చరణమ్,
ధన మభిలాషనిరోధన మత్యాశ్రమవర్తినాం పుంసామ్. ౮౮

తా. సర్వసంగపరిత్యాగులయి సన్న్యాసాశ్రమము స్వీకరించిన మహాత్ములకుఁ గురువుల కడఁజేరుటయే గృహప్రవేశము. పంచాక్షరీపురశ్చరణమే వారికి శరణము. అభిలాషను నిరోధించుటయే ధనము.

శ్లో. సవిధి ర్యత్తే విదధతి స ప్రతిషేధో యతో నివర్తంతే,
సోఽనిష ద్యద్బ్రువతే శైవాశ్రమవర్తినో ధీరాః. ౮౯

తా. పరమేశ్వర సేవానుకూలమగు సన్న్యాసాశ్రమ ధర్మముల నాచరించు మహాత్ములు ఏకృత్యమును నీకు విధింతురో అదియే శాస్త్రీయమయినవిధి. వారు దేనినాచరింపరో అదియే నిషేధము. వారేదిపలికెదరో అదియే ఉపనిషద్వాక్యము.

ముక్తి.

శ్లో. కౌపితరౌ? కః పుత్రః? క స్స్వామీ? యః ప్రపంచస్య,
ప్రత్యస్తమితే భేదే తత్కిమిదం కిమితి తే ప్రశ్నః. ౯౦

తా. ప్రశ్న:—తల్లితండ్రులెవ్వరు?

సమాధానము:—ఎవరు జగత్తునకు తల్లితండ్రులో వారే తల్లితండ్రులు (అనఁగా పార్వతీ పరమేశ్వరులే తల్లితండ్రులని భావము.)

ప్రశ్న:—నీకు ప్రభువెవ్వఁడు?

సమా:—ప్రపంచమున కెవ్వఁడు ప్రభువో అతఁడే నాకున్ను ప్రభువు.

నీవు నేనను భేదబుద్ధి నశించిన పిదప అది ఏమి? ఇది ఏమి? యను ప్రశ్నమే యుండఁగూడదు.

శ్లో. త్యజ సంసార మసారం భజ శరణం పార్వతీరమణమ్,
విశ్వసిహి శ్రుతిశిఖరం విశ్వమిదం తన నిదేశకరమ్. ౯౧

తా. సారములేని సంసారమును వదలుము. పార్వతీపతియగు పరమశివుని శరణు పొందుము. ఉపనిషత్సిద్ధాంతమును విశ్వసింపుము. అప్పుడు ప్రపంచమంతయు నీయాజ్ఞాప్రకారము నడుచుకొనును.

శ్లో. భవ్య మభవ్యం వా నః ప్రలిఖతు వేధా స్సుదుర్మేధాః,
సవ్య మసవ్యం వా న శ్చరణం శరణం మహేశస్య. ౯౨

తా. బుద్ధిలేని బ్రహ్మదేవుఁడు మా నొసట మంచియో చెడ్డయో ఏదియో ఒకటి వానియిష్టానుసారము వ్రాయుఁగాక. మాకుమాత్రము పరమశివునియొక్క ఎడమకాలో కుడికాలో ఏదియో ఒకటి శరణముగనున్నది అదియే మాకుచాలును.

శ్లో. వేధాః కథం? హరిః కథ? మితి తు ప్రశ్నే వయం మూకాః,
శివ మేకం జానీమ స్తస్మా దన్యం న జానీమః. ౯౩

తా. బ్రహ్మ ఎట్టివాఁడు? విష్ణు వెట్టివాఁడు ? అని మీరు ప్రశ్నించినయెడల అంశములకు సమాధానమొసంగుటకు మేము మూగవారము. పరమశివు నొక్కనినే ఎఱుంగుదుము. ఆయీశ్వరునికంటె ఇతరము నేమియు నెఱుంగము.

శ్లో. దారుణ మసిపత్రవనం దారుణతమ మన్ధతామిస్రమ్,
కా వా తతః క్షతి ర్నః? శైవా వయ మాచతుర్వదనాత్. ౯౪

తా. అసిపత్రనరకము భయంకరమయినది. అంధతామిస్రనరకము అంతకంటె భయంకరమయినది. కాని దానివలన మాకేమిభయము? మేము సృష్ట్యాదినుండియు శివభక్తులము. (శివభక్తులగువారలకు నరకబాధలేదని భావము )

శ్లో. కృతదీక్షో ఘోరముఖే కులకూటస్థో భరద్వాజః,
విద్యేశ్వరేషు కశ్చన పితామహో న ఇతి విస్రంభః. ౯౫

తా. మాగోత్రఋషియగు భరద్వాజమహర్షి మహాయజ్ఞములు చేయుటయందు దీక్షవహించె నను ప్రసిద్ధిగలదు. మాతాతగారు (అప్పయదీక్షితులవారు) విద్యేశ్వరులలో నొక్కఁడని మానమ్మకము. (కనుక అట్టిమహాత్ముల వంశమునందు జన్మించిన నేను సద్గతికి పాత్రుఁడనని భావము.)

శ్లో. కలహః కదాఽపిమా స్త్వితి కలితశరీరైక్యయో శ్శివయోః,
అహ మస్మ్యహ మస్మీతి ప్రాప్తః కలహో మమ త్రాణే. ౯౬

తా. పార్వతీ పరమేశ్వరు లిరువురు తమ కెప్పుడు జగడము లేకపోవలయుననుతలంపుతో అర్ధనారీశ్వరరూపమును దాల్చిరి. అట్లున్నప్పటికిన్నీ వారిరువురకు నామూలమున అనఁగా "నేను కాపాడెదనని పార్వతియు, నేనుకాపాడెదనని యీశ్వరుఁడును యొకరితోకరు పోట్లాడుకొనుచున్నారు. ఈగ్రంథకర్తయగు నీలకంఠదీక్షితుఁడు పార్వతీపరమేశ్వరుల కిరువురకున్నూ తాను భక్తుఁడనని సూచించినాడు.

శ్లో. నరకాయాపి న భోగా న్నరాధమాయాపి నాన్యసురాన్,
మన్యన్తే కతిచి దమీ మాహేశ్వర మాశ్రితా యోగమ్. ౯౭

తా. మాహేశ్వరయోగము నాశ్రయించిన కొందఱు శివభక్తులు విషయభోగములను నరకముకంటె తుచ్ఛమయినవానినిగాఁ జూచుచున్నారు. శివేతరులగు దేవతలను నరాధములకంటె తక్కువవారినిగా భావించుచున్నారు.

శ్లో. జ్ఞాతుం హాతుం విషయం శ్రోతుం మంతుం గ్రహీతు మాత్మానమ్,
వత్స యది న ఘటయథ్వే తత్సాధయతావిముక్తాయ. ౯౮

తా. ఓ అజ్ఞానులగు జీవులారా! జ్ఞానము నెఱుంగుటకును, విషయభోగముల పరిత్యజించుటకున్నూ, ఆత్మతత్త్వము నెఱుంగుటకున్నూ మీకు సామర్థ్యము లేనియెడల కాశీపట్టణమునకు బయలుదేరిపొండు (అనఁగా తామున్నచోటనుండి తత్త్వజ్ఞానము నెఱింగినవారలయి విషయాభిలాషను వదలినయెడల వారలకు ముక్తి యచ్చటనే కలదనియు, అట్టి జితేంద్రియత్వము లేనివారలు విశ్వనాథుని రాజధాని యగు కాశీపట్టణమునంగు వాసముచేసిన గంగాస్నానాదికము లొనర్చుచు కాశీమరణమువలన ముక్తి నందుదురనియు భావము.

శ్లో. సాంఖ్యం యోగో నియమా భక్తిః కర్మ ప్రపత్తి రితి,
ఏకత్ర సకల మేతత్ కేవల మవిముక్త మేకత్ర. ౯౯

తా. సాంఖ్యము, యోగము, నియమము, భక్తి, కర్మాచరణము, ప్రపత్తి, ఇవన్నియుచేరి ఒకయెత్తు. కాశీవాసమొకయెత్తు. (అనఁగా ముక్తినందుటకు పై రెండును సమానములయిన మార్గములని భావము)

శ్లో. బద్ధః క స్తే వక్ష్యతి? ముక్తో ముక్తిం విజానాతి,
యాస్యసిచే దవిముక్తం జ్ఞాస్యసి విశ్వేశ్వరస్య ముఖాత్. ౧౦౦

తా. (ఎవ్వఁడయిన ముక్తియనునది ఎట్టిదో తెలుసుకొనఁగోరి ముక్తియనునెట్టిది? యని ఎవ్వనినేని ప్రశ్నించినయెడల) ముక్తుఁడు కాని మోహపాశబద్ధుఁడు తనకేమియు తెలియదు కావున వాడందులకు సమాధాన మెట్లుచెప్పును? ముక్తియనునది వేఱుగా లేక పోవుటచేత ముక్తునకుకూడ ఏమి చెప్పుటకున్నూ సాధ్యముకాదు. కనుక కాశీనగరమునకుఁ బోయినయెడల భక్తపరాధీనుఁడగు విశ్వనాథుఁడే ముక్తి యిట్టిదని నీకుఁబోధించును. (కాశీవాసులకు ముక్తి స్వతస్సిద్ధమని భావము.)

శ్లో. నగృహీతం శ్రుతిహృదయం నచ నిగృహీతం పరిప్లవంహృదయమ్,
ఇచ్ఛామి చ ధామ పరం గచ్ఛామి చ విశ్వనాథపురమ్. ౧౦౧

తా. వేదరహస్య మిదియని తెలియదు. ఆయావిషయములందు పరుగిడుచుండు మనస్సును నిలుపుకొనజాలకున్నాఁడను. సర్వోత్కృష్టమయిన మోక్షపదము కావల

యనని కోరుచున్నాఁడను. కావున నేను విశ్వనాథునకు నివాసభూమియగు కాశీనగరము నకుఁ బోవుచున్నాఁడను.

శ్రీ అప్పయ్యదీక్షితులవారి పౌత్త్రుఁడగు మహాకవి నీలకంఠదీక్షితునిచేత రచింపఁబడిన సుభాషితశతకత్త్రయమునందు వైరాగ్యశతకము సంపూర్ణము.

సుభాషితశతకత్త్రయము సమాప్తము.

---

# నీలకంఠదీక్షితుఁడు.

సర్వతంత్రస్వతంత్రుఁడయి ఈశ్వరావతారుఁడని లోకప్రసిద్ధినంది ౧౦౪ గ్రంథములరచించి బ్రహ్మభూయమునందిన శ్రీమదప్పయ్యదీక్షితులవారి తమ్ముఁడును, తత్తుల్యుఁడును అగు ఆచ్చాదీక్షితులకు "ఈనీలకంఠదీక్షితుఁడు పౌత్త్రుఁడు. తండ్రి నారాయణశాస్త్రి. తల్లి భూమిదేవి, నారాయణశాస్త్రి గారి పుత్త్రులలో నీలకంఠదీక్షితుఁడు రెండవవాఁడు, ఇతఁడును సర్వతంత్రస్వతంత్రుఁడు, అప్పయ్యదీక్షితునివలనే పరమశైవుఁడు, సామవేది, భారద్వాజసగోత్త్రుఁడు, మహాకవి, వేదవేదాంగపారగుఁడు, మధురానగరమును బరిపాలించిన తిరుమలనాయక భూపాలునకు ప్రధానమంత్త్రియు, పండితమండలీ సార్వభౌముఁడును అయి యజ్ఞయాగాదికము లనేకము లొనర్చి సకలశాస్త్రములందు ప్రబంధములనొనర్చి వేదవేదాంగముల శిష్యులకు బోధించుచు కులపతులగు ప్రాచీనమహర్షులతో తులఁదూగుచు గంగాయాత్త్రఁజేసి బ్రహ్మభూయమందెను.

ఇతనికాలము:—ఇతఁడొనర్చిన "శివలీలార్ణవమహాకావ్యము. ౪౭౩౮ (క్రీ.శ. ౧౬౩౭) కల్యబ్దమునందు నిర్మింపబడినటుల చెప్పఁబడియుండుటచేత ఇతఁడు దాదాపు క్రీ. శ. పదునేడవశతాబ్దముయొక్క ప్రారంభమున జన్మించి దాదాపు ౬౦, ౭౦ సం, వఱకు జీవించి బ్రహ్మభూయము నందియుండును.

ఇతఁడొనర్చిన లఘుప్రబంధములు:—కలివిడంబనశతకము, సభారంజనశతకము, వైరాగ్యశతకము, అన్యాపదేశశతకము, శాంతివిలాసము, ఆనందసాగరస్తవము, వీనికి "నీలకంఠదీక్షితుని షడ్గ్రంథములని ప్రసిద్ధిగలదు.

మహాకావ్యములు:—శివలీలార్ణవము, గంగావతరణము, నీలకంఠవిజయచంపువు.

ఇతరగ్రంథములు:—నలచరిత్రనాటకము, శివతత్త్వరహస్యము, కైయటవ్యాఖ్యానము.

ఇతరగ్రంథము లెన్నియో రచించినట్లు తెలియుచున్నది గాని వానిపేరులు తెలియవు. ఇతనిపుత్త్రులుకూడ సర్వతంత్రస్వతంత్రులును, మహాకవులునై విఖ్యాతినందిరి.

---